# విజ్ఞప్తి

ఈ నెల 'చందమామ' విడుదల ఆలస్యమైనందుకు మన్నించవలసిందిగా పాఠకులనూ, ఏజంట్లనూ కోరుతున్నాము. ఇందుకు ముఖ్య కారణం పవర్ సప్లయిలో వచ్చిన తగ్గుదల. ఈ చిక్కులను ఎదుర్కొని పత్రికను సకాలంలో వెలువరించేందుకు గట్టి ప్రయత్నాలు చేస్తున్నాము. ఈ అనివార్య ఆలస్యాలను ఉదారతతో స్వీకరించమని అర్థిస్తున్నాము.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళ కథ [''ఒక్కనాటి స్వర్గం''] బూర్లె నాగేశ్వరరావు రచన. ఎలాంటి సామర్థ్యం, తెలివితేటలూ లేనివాడు, అదృష్టంకొద్దీ ఐశ్వర్యవంతుడైతే, దాన్ని అతడెలా నిలుపుకోలేడో ఈ కథ ద్వారా మనకు తెలుస్తుంది.

''అన్నింటికంటె నీచవృత్తి'' అన్న కథలో రంగిశెట్టికి దొంగతనం చేయటం క్షణాల మీద లక్షాధికారి కావటానికి అనువైన మార్గంగా కనిపించింది. కాని, తీరా అందులో ప్రవేశించాక, దొంగతనం ఎంత ప్రాణాంతకమైనదో, నీచమైనదో అర్థమైంది.

---

సంపుటి 60 జూన్ '77 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00









ధర్మేణోపలభే ద్ధర్మ,
మధర్మం చాప్యధర్మతః;
యద్యధర్మేణ యుజ్యేయుః
యేష్యధర్మః ప్రతిష్ఠితః,
యది ధర్మేణ యుజ్యేరు
న్నాధర్మరుచయో జనాః,
ధర్మేణ చరతాం ధర్మః
తథా చైషాం ఫలం భవేత్. 1

[అధర్మం ఆచరించే వారికి అధర్మఫలమూ, ధర్మం ఆచరించే వారికి ధర్మఫలమూ కలిగే మాటుంటే ధర్మపరులకు సుఖమూ, అధర్మపరులకు దుఃఖమూ కలుగుతుందనుకోవచ్చు. కాని—]

యస్యా దర్థా వివర్ధంతే
యేష్వధర్మః ప్రతిష్ఠితః,
క్లిశ్యంతే ధర్మశీలా శ్చ,
తస్మాదేతౌ నిరర్థకా. 2

[అధర్మాన్నే అవలంబించే వారు బాగుపడి, ధర్మాన్ని అవలంబించిన వారికి దుఃఖం కలుగుతూంటే, ధర్మా ధర్మాలు రెండూ నిరర్థకం అవుతాయి.]

---

ఏది ధర్మం? ఏ దధర్మం?

---



## 48

చంద్రసరస్సులో పుష్కలంగా నీరున్నది. ఎడతెగక ప్రవహించే జల ఒకటి అందులో ఉన్నది. దాన్ని సమీపించే మార్గంలో అనేకమంది మునులు తపస్సు చేసుకుంటున్నారు. అక్కడ అసంఖ్యాకమైన హంసలూ, పావురాళ్లూ, బాతులూ, కొంగలూ ఉన్నాయి. దాని ఒడ్డున రకరకాల మహావృక్షాలుండి, వాటి కొమ్మలు నీటి మీదికి వంగి ఉన్నాయి. ఆ చెట్లకు పూతీగలు అల్లుకుని, సువాసనలు వెదజల్లుతున్నాయి. ఆ పూల కోసం వచ్చిన తుమ్మెదల దండు ఝుంకారం చేస్తున్నది. నీటిలో పెద్ద పెద్ద కెరటాలు లేచి, నురుగు తెప్పిస్తున్నాయి. సరస్సులో ఎర్ర తామరలూ, తెల్ల తామరలూ ప్రకాశిస్తున్నాయి. ఒడ్డున గల దట్టమైన పొదలు సూర్యుడి వేడిని అరికట్టి, ఆ ప్రదేశాన్ని చల్లగా ఉంచుతున్నాయి. ఏనుగులు తిరిగి వెళ్ళి, తమ నాయకుడైన చతుర్దంతానికి ఈ సరస్సు గురించి చెప్పాయి.

అప్పుడు చతుర్దంతమూ, ఇతర ఏనుగులూ చంద్రసరస్సు వద్దకు వచ్చి, అన్ని పక్కల నుంచీ అరిదులోకి చొరబడ్డాయి. అవి తమ దాహం తీర్చుకుని, చిత్తం వచ్చినట్టు నీటిలో చాలాసేపు ఓలలాడి, తమ అరణ్యానికి తిరిగి పోయాయి.

సరస్సు ఒడ్డున బొరియలలో అనేక వేల కుందేళ్లు నివసిస్తున్నాయి, ఏనుగులు నీటి కోసం వెర్రిగా పరిగెత్తి రావటంలో వాటి కాళ్ళకింద పడి అనేక వందల కుందేళ్ళు చచ్చాయి. అంతకన్న ఎక్కువ సంఖ్యలో గాయపడాయి.




ఏనుగులనన్నిటిని తిరిగి వెళ్ళిపోనిచ్చి, చావగా మిగిలిన కుందేళ్ళు సమావేశం జరిపి, ఇలా అనుకున్నాయి :

''ఏమిటి కర్తవ్యం? మనకు నాశం తప్పదు. ఏనుగులు ఈ సరస్సుకు రోజూ రాకమానవు. ఎందుకంటే ఈ సరస్సులో తప్ప చుట్టుపట్ల ఎక్కడా నీరులేదు. అందుచేత మనం సర్వనాశనం కాకుండా ఉండాలంటే, ఏనుగులు ఈ సరస్సుకు రాకుండా చెయ్యటానికి ఏదైనా మార్గం ఆలోచించాలి.''

విజయ అనే ముసలి కుందేలు గాయపడిన కుందేళ్ళనూ, పిల్లలనూ, భార్యలనూ పోగొట్టుకున్న కుందేళ్ళనూ చూసి అమితమైన విచారం పొంది, ''విచారించకండి, తమ్ముళ్ళూ. మనమే చిహ్నంగా గల చంద్రదేవుడి సహాయంతో నేను పథకం వేస్తాను,'' అన్నది.

ఈ మాట విని కుందేళ్ళ రాజు సిలీముఖం ఇలా అన్నది :

''విజయా, నువు న్యాయసూత్రాలు తెలిసిన సమయజ్ఞుడివి, వెళ్ళిరా! ఏం చేస్తావో అదంతా నీకే వదులుతున్నాను. నువు మాత్రం కార్యం సాధించుకురా!''

విజయ మర్నాడు సాయంత్రం కష్టసాధ్యమైన కార్యభారం మీద వేసుకుని బయలుదేరింది. దానికి దారిలో చతుర్దంతమూ, ఇతర ఏనుగులూ సరస్సుకు వస్తూ ఎదురుపడ్డాయి. ఏనుగులు నల్లమబ్బుల్లాగానూ, వాటి ఘీంకారాలు ఉరుముల్లాగానూ ఉన్నాయి. వాటినిచూసి విజయ, ''వీటి మధ్యకు వెళ్ళటం ప్రమాదకరం. నేను నజ్జునజ్జు కావటానికి వాటి స్పర్శ చాలు,'' అనుకుని, ఒక ఎత్తయిన కొండ రాయి మీదికి ఎక్కి, ''ఏనుగులరాజా, క్షేమమా?'' అని చతుర్దంతాన్ని అడిగింది.

విజయను చతుర్దంతం అతికష్టం మీద పొడగని, "ఎవరు నువు?" అని అడిగింది.

"నేను రాయబారిని," అన్నది విజయ.

''నిన్నెవరు పంపారు ?'' అని చతుర్దంతం అడిగింది.

'చంద్రదేవుడు,'' అన్నది విజయ తొణకకుండా.

'' ఎందుకు పంపాడు ? '' అని ఏనుగు అడిగింది.

" దూతను అవమానించరాదని తమకు తెలుసు. నేను నా ఏలిక చెప్పమన్న మాటలే చెబుతాను. చంద్రదేవుడు ఇలా చెప్పమన్నాడు : 'చంద్రసరస్సు నాదని ప్రపంచమంతా ఎరుగును. మీరు అక్రమంగా వచ్చి, దాని పవిత్రతను పాడు చేశారు. అంతేగాక శశాంకుడి నైన నాకు చిహ్నంగా ఉండే కుందేళ్లను చాలావాటిని సరస్సు ఒడ్డున తొక్కి చంపారు. ఇన్ని మాట లెందుకు? మీరు నా సరస్సు జోలికీ, నా కుందేళ్ళ జోలికీ రావటం మానకపోయారో మీకు ఘోరమైన విపత్తు కలుగుతుంది. నా దయ వల్ల, నేను ప్రసరించే వెన్నెలలో మీరు నా అరణ్యంలో స్వేచ్ఛగా మసలగలుగుతున్నారు. మీరు నా సరస్సు జోలికి మళ్ళీ వచ్చారంటే నా చల్లని కిరణాలను ఉపసంహరించి, మీకు వేడి పుట్టించి, నెత్తురుగడ్డలు లేచి భయంకరంగా చచ్చేటట్టు చేస్తాను'.''

ఈ సందేశం విని చతుర్దంతం చాలా భయపడి విజయతో, '' మిత్రమా, నేను చంద్రదేవుడికి చాలా అపచారం చేశాను. నన్ను ఆయన దగ్గిరికి తీసుకుపోతే క్షమాపణ చెప్పుకుంటాను,'' అన్నది.

విజయ చతుర్దంతాన్ని చంద్రసరస్సుకు తీసుకుపోయి, సరస్సులో ప్రతిబింబించిన చంద్రుణ్ణీ, నక్షత్రాలనూ చూపింది. ఏనుగు తన తొండంతో నీరు తీసుకుని మీద పోసుకున్నది. నీటి కదలిక వల్ల అందులో వెయ్యి చంద్రబింబాలు ఏర్పడ్డాయి.

ఏనుగు విజయను, చంద్రదేవుడికి తన మీద ఎందుకు కోపంవచ్చిందని అడిగింది; '' నువు నీటిని తాకినందున,'' అని విజయ చెప్పింది.

ఏనుగు హడలిపోయి, చంద్రబింబానికి సాష్టాంగపడి, '' ఇంక ఎన్నడూ ఇక్కడికి రాను,'' అని క్షమాపణ చెప్పుకుని, అక్కడినుంచి వెళ్ళిపోయింది.



# 186. "ఇంతేసి గుమ్మడికాయలు!"

"మా తాతల కాలంలో ఇంతేసి గుమ్మడికాయలు కాసేవి!" అని జానపదకథల్లో చదువుతాం. కాని దక్షిణ కెనడా కూరలపెంపకంలో అమెరికాతోనూ, యూరప్‌తోనూ పోటీ చెయ్యగలదని ఈ "స్క్రాప్"లు రుజువుచేస్తాయి.





# మాయాసరోవరం

## 18

[సర్పనఖుడు, సర్పస్వరుడు అనే అన్నదమ్ములిద్దరు, జలాశ్వాల మీద మరుగుజ్జుల గూడేనికి వచ్చారు. సర్పనఖుడు, కృపాణజిత్తు మెడకు తాడు బిగించాడు. నరవానరం, సర్పస్వరుడి పైనబడి, అతణ్ణి ఎత్తుకుపోయింది. ఈ సంగతి విన్న జయశీలుడూ, సిద్ధసాధకుడూ గూడెం కేసి వచ్చేంతలో, సర్పనఖుడు వాళ్ళకు జలాశ్వం మీద వస్తూ కనిపించాడు. తరవాత—]

సర్పనఖుడు ఒక పెద్ద చెట్టు కిందికి వచ్చి, తన వాహనాన్ని ఆపి, చుట్టూ ఓ మారు కలయ చూశాడు. అక్కడ ఆకాశాన్నంటే. మహా వృక్షాలూ, వాటికి దాపుల ఒత్తుగా పెరిగిన ముళ్ళపొదలూ తప్ప, అతడి తమ్ముడి జాడలేమీ కనిపించలేదు. ఈసారి సర్పనఖుడు మరింత పెద్దగా, ''సర్పస్వరా!'' అంటూ కేక పెట్టాడు.

ఆ కేకకూ జవాబులేదు. సర్పనఖుడు దిగాలుపడిపోయి, అంతలోనే పట్టరాని కోపంతో ఒరలో నుంచి కత్తిలాగి, దాన్ని పక్కనే వున్న చెట్టు బోదెలో బలంగా గుచ్చి, ''ఇదే, నా ప్రతిజ్ఞ! నా తమ్ముణ్ణి ప్రాణాలతో చూడలేకపోయానే, వాణ్ణి చంపిన నరవానరాన్ని, దాని యజమానినీ కంతాలు నరికిగాని, యీ ప్రాంతాలు వదలను!'' అంటూ అరిచాడు.



వృథా. వాడు తప్పక ప్రాణాలకు తెగించి పోరాడేందుకు సిద్ధపడతాడు. వాణ్ణి ఏదైనా ఉపాయంతో పట్టుకోవాలి....

జయశీలుడు యిలా ఆలోచిస్తూ, సిద్ధ సాధకుడితో, "సాధకా, నీ రూపం, మాట తీరూ కూడా మామూలు మనుషులకు భిన్నంగా వుంటుంది. కనక నువ్వే వాణ్ణి పట్టగలవు. ఈ సర్పనఖుడు మనకు ప్రాణాలతో దొరకటం మీద, మనం మాయాసరోవరాన్ని చేరటం, చేరలేక పోవటం ఆధారపడుతుంది. ఏమంటావు?" అన్నాడు.

"అవును. మనం తెలిసీ లోగడ ఆ మకరకేతును వదిలాం. ఇప్పుడు వాడి మిత్రుడైన యీ సర్పనఖుడు, మనను మాయాసరోవరం దగ్గిరకు తీసుకుపోయే వరకూ, వదలరాదు." అన్నాడు సిద్ధ సాధకుడు.

"అదే చేయబోతున్నాం. నువ్వు ఏదో విధంగా వాణ్ణి సమీపించి, వాడి దగ్గిర నుంచి ఆ కత్తి తీసుకోవాలి. నిరాయుధుడుగా వున్న వాణ్ణి బంధించి, వాడి ద్వారా ఆ సరోవరానికి పోయే దారి తెలుసుకునే పని నేను చూస్తాను." అన్నాడు జయశీలుడు.

ఆ వెంటనే సిద్ధసాధకుడు పొదల వెనక నక్కుతూ, దూరంగా వున్న చెట్ల

పొదల వెనక దాగివుండి యీ మాటలు విన్న జయశీలుడు తృప్తిగా నవ్వి, సిద్ధ సాధకుడితో, "సాధకా, యీ సర్పనఖుడి ప్రతిజ్ఞ విన్నావుగదా? వాడు అరణ్య వృక్షాల సాక్షిగా గొప్ప కఠోర ప్రతిజ్ఞ చేశాడు." అన్నాడు.

"జయశీలా, తమ్ముడు కనబడలేదన్న దిగులులో వాడికి మతిస్థిమితం తప్పిందని నా అనుమానం. సరే, వాణ్ణి ప్రాణాలతో పట్టుకునే సంగతేమిటి?" అని అడిగాడు సిద్ధసాధకుడు.

సర్పనఖుడు తీవ్రావేశంలో వున్నట్టు తెలుస్తూనే వున్నది. అలాంటి వాణ్ణి ఎదటపడి లొంగిపొమ్మని ఆజ్ఞాపించటం



చాటుకు బయలుదేరాడు. జయశీలుడు, మరుగుజ్జు సేనానితో, ''సేనానీ, యీ వింత రూపుడి శక్తిసామర్థ్యాలేమిటో మనకు తెలియవు. అవసరం పడితే సాధకుడికి సహాయపడేందుకు నీవు, నీ పొట్టేలు వాహనంతో ఏ చెట్టుచాటున అయినా దాగి వుండగలవా ?'' అని అడిగాడు.

''అయ్యా, అదెంతపని! ఈ నీటి గుర్రంవాణ్ణి కావాలంటే నేనే చెట్టు కొమ్మల్లోంచి మీదికి దూకి, కాళ్ళూ చేతులూ కట్టెయ్యగలను.'' అంటూ మరుగుజ్జు సేనాని తన వాహనం కట్టివేసి వున్న రేగుపొదల కేసి బయలుదేరాడు.

తరవాత ఒకటి రెండు నిమిషాలు గడిచే లోపల సిద్ధసాధకుడు శూలాన్ని ఎత్తి పట్టుకుని, చెట్ల చాటునుంచి బయిటికి వస్తూ, ''ఎవర్రా, నా పెంపుడు సాలవృక్షాన్ని కత్తితో పొడిచి గాయపరిచింది? దాని మూలుగు విని, నాకు నిద్రాభంగమైంది.'' అంటూ కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే సర్పనఖుడు చప్పున కత్తిని చెట్టుబోదె నుంచి లాగి, సాధకుడి కేసి దాన్ని గురిచేసి నిబ్బరంగా నిలబడ్డాడు. సాధకుడు అతణ్ణి సమీపిస్తూ, ''ఒరే, నువ్వు చూడగా మాయాసరోవరేశ్వరుడి బంటులావున్నావు. అవునా?'' అన్నాడు.

ఇంత భయంకరారణ్యంలో తనను చూస్తూనే, తన యజమాని ఎవరైనదీ గ్రహించిన యితడెవరోగాని, గొప్ప మంత్రవేత్త అయివుంటాడనుకుని సర్పనఖుడు ఆశ్చర్యంతో, భయంతో వణికిపోసాగాడు.

సిద్ధసాధకుడు తన ఎత్తు పారినందుకు లోలోపల సంతోషిస్తూ, ''మాయాసరోవరేశ్వరుడి బంటుననే గర్వంతో, అలా గుర్రం మీద ఠీవిగా కూర్చుంటావా ? ముందు గుర్రం దిగు,'' అన్నాడు గద్దిస్తూ.

సర్పనఖుడు చప్పున జలాశ్వంపై నుంచి కిందికి దూకాడు. సాధకుడు అతడి ముందుకు వచ్చి, ''ఏదీ, ఆ కత్తి యిటివ్వు.'' అన్నాడు.



ఆ మాట వింటూనే సర్పనఖుడు చప్పున నాలుగైదడుగులు వెనక్కు వేసి, సాధకుడి కేసి అనుమానపడుతున్నట్టు చూస్తూ, '' నా కత్తితో నీకేం పని? నన్ను నిరాయుధుణ్ణి చేయాలనుకోవటంలో ఏదో మోసం వున్నది. అసలు నీకు మా యజమాని పేరు ఎలా తెలుసు? నువు చెట్టు మూలుగు వినగలిగినంత గొప్ప మంత్రవేత్తవా?'' అన్నాడు.

సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, '' ఒరే, సర్పనఖా! నీవన్నీ మతిమాలిన ప్రశ్నలు. నేను, నీ మిత్రుడైన మకరకేతుణ్ణి కూడా ఎరుగుదును. ఆ కత్తి నీ చేతిలో వుండటం, నీకే ప్రమాదం. దాన్ని వెంటనే కింద పడవెయ్యి.'' అంటూ శూలం ఎత్తి, సర్పనఖుడి కేసి రాసాగాడు.

సర్పనఖుడు ఒకక్షణం నివ్వెరపోయి, అంతలోనే తేరుకుని, అన్నిటికీ తెగించిన వాడిలా పళ్ళుకొరికి, '' ఇప్పుడు నువ్వెవరైందీ నాకు గుర్తుకొస్తున్నది. నరవానరం యజమాని కృపాణజిత్తు అనేవాడు నిన్నూ, నీ మిత్రుడైన మరొకణ్ణీ అరణ్యంలో చూశాడు. నువ్వు కాపాలికుడివి, అవునా?'' అన్నాడు కత్తి పైకెత్తి పట్టుకుని.

సిద్ధసాధకుడికి అతణ్ణి శూలంతో పొడవాలన్నంత కోపం వచ్చింది గాని, జయశీలుడు ప్రాణాలతో పట్టుకోవాలన్నాడు. కాని, సర్పనఖుడు ఒకపట్టాన లొంగిపోయేలా లేడు. సిద్ధసాధకుడికి ఆ సమయంలో చప్పున ఒక ఉపాయం తోచింది. అతడు శూలాన్ని నేలలో గుచ్చి, '' ఒరే, సర్పనఖా! నువ్వనుకున్నట్టు నేను మామూలు కాపాలికుణ్ణి కాను; సిద్ధసాధకుణ్ణి. నా శూలాన్ని దూరంగా పారేస్తాను; నీ కత్తిని దూరంగా పారవెయ్యి. అప్పుడు సంగతి సందర్భాలు తాపీగా మాట్లాడుకుందాం,'' అన్నాడు.

'' అహఁ, కాపాలికా, నీ ఎత్తుగడ నాకు తెలిసింది! నన్ను నిరాయుధుణ్ణి చేసి పట్టుకుని ఏ క్షుద్రదేవతకో బలి యివ్వాలనుకుంటున్నావు. అవునా? చూడు,

నిన్నిప్పుడే పరలోకానికి ప్రయాణం కట్టిస్తాను.'' అంటూ సర్పనఖుడు కత్తిచాచి, సిద్ధసాధకుడి మీదికి లంఘించబోయాడు.

సిద్ధసాధకుడు తనకు రానున్న ప్రమాదాన్ని గుర్తించి నేలకు గుచ్చిన శూలాన్ని చేతికి తీసుకోబోతున్నంతలో, సర్పనఖుడు అతణ్ణి సమీపించి కత్తితో గుండెల్లో పొడవబోయాడు. కాని, అదేక్షణంలో మరుగుజ్జు సేనాని వెనకనుంచి వచ్చి, తన పొట్టేలుతో సర్పనఖుణ్ణి ఢీకొట్టించాడు. సర్పనఖుడు ఒక చావుకేక పెట్టి బోర్లా ముందుకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి జారి దూరంగా పడింది.

సిద్ధసాధకుడు చప్పునపోయి కత్తి మీద పాదం మోపి, పెద్దగా ఒకసారి నవ్వి, ''మరుగుజ్జుసేనానీ, నీ సమయస్ఫూర్తి మెచ్చదగింది. నిన్ను మహాకాలుడు సర్వదా రక్షిస్తూంటాడు. జై మహాకాళా!'' అన్నాడు.

అంతలో అక్కడికి జయశీలుడు వచ్చాడు. అతడు బోర్లాపడివున్న సర్పనఖుణ్ణి భుజాలు పట్టి లేపి నిలబెట్టి, ''ఒరే, సర్పనఖా, నీ పేరే ఒక వింత; నీ ప్రవర్తన మరింత వింతగా వున్నది. సర్పానికి కోరలుండటం ఎరుగుదుంగాని; గోళ్ళుండటం ఎరగం! సిద్ధసాధకుడంతటివాణ్ణి, నీ మొండికత్తితో పొడిచి చంపాలనుకున్నావా?'' అన్నాడు.

''జై, మాయాసరోవరేశ్వరా! నీవే రక్ష.'' అంటూ సర్పనఖుడు పెద్దగా





అయిన మాయాసరోవరేశ్వరుడు దొంగ చాటుగా హిరణ్యపురం రాజుగారి కుమారుణ్ణీ, కుమార్తెనూ ఎత్తుకుపోయాడు. వాడి బంటువైన నీవు, ఏవో బింకాలు పలుకుతున్నావు. ఏదీ, నాతో కత్తియుద్ధానికి రా. నిన్ను మాత్రం ఏ పరిస్థితుల్లోనూ చంపను. నీతో నాకు ఒక ముఖ్యమైన పని వున్నది.'' అన్నాడు.

''ఆఁ, పనా? ఆ పనేమిటో నాకు తెలుసు. కాచుకో దెబ్బ!'' అంటూ సర్పనఖుడు కత్తిని జయశీలుడి కంఠానికి గురిచేసి విసిరాడు.

జయశీలుడు తన కత్తితో, సర్పనఖుడి కత్తిని పక్కకు నెట్టి, ఎడమకాలితో అతడి మోకాలిమీద గట్టిగా తన్నాడు. ఆ దెబ్బకు సర్పనఖుడు పక్కకు పడి లేస్తూ, ''అన్యాయం! ఇదేం కత్తియుద్ధం?'' అని బిగ్గరగా అరుస్తూ తిరిగి జయశీలుడి మీదికివచ్చాడు.

''ఏ పరిస్థితుల్లోనూ నిన్ను చంపనని ముందే చెప్పాను గదా? నీ మిత్రుడు మకరకేతు చేయవలసిన పని నీతో చేయించబోతున్నాను.'' అంటూ జయశీలుడు, సర్పనఖుడు తన గుండెల్లో గుచ్చబోయిన కత్తిని, తన కత్తితో కిందికి కొట్టి, యీసారి కుడికాలితో అతడి పొట్టలో గట్టిగా పొడిచాడు.

మూలిగి, ''మీరెవరోగాని నన్ను మోసంతో, అధర్మ పద్ధతిలో నిరాయుధుణ్ణి చేశారు. ఆ కత్తి నా చేతిలో వున్నట్టయితే, యీపాటికి మీ అందర్నీ ముక్కలు ముక్కలుగా నరికి వుందును.'' అన్నాడు కోపంతో వణికిపోతూ.

జయశీలుడు మారుమాట్లాడకుండా సిద్ధసాధకుడి దగ్గిరకు పోయి, ''సాధకా, ఏదీ యీ సర్పనఖుడి కత్తి యిటివ్వు.'' అన్నాడు.

సిద్ధసాధకుడు తన కాలి కింద వున్న కత్తిని తీసి జయశీలుడి కిచ్చాడు. జయశీలుడు దాన్ని తీసుకుపోయి సర్పనఖుడికి యిస్తూ, ''ఒరే, సర్పనఖా! నీ యజమాని

ఆ పోటుకు సర్పనఖుడు పెద్దగా అరుస్తూ విరుచుకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి దూరంగాపోయి పడింది. "ఛీ. ఛీ. యిది కత్తియుద్ధమా? మల్ల యుద్ధం కన్న కూడా అధమంగా వుంది." అంటూ సర్పనఖుడు లేచి నిలబడ్డాడు.

"అయితే మల్లయుద్ధంలోనే నన్ను జయించు." అంటూ జయశీలుడు అతడిపై కలబడి. నడుము పుచ్చుకుని. పైగెత్తి. కొంచెం దూరంలో నిలబడి అంతా చూస్తూ వినోదిస్తున్న సిద్ధసాధకుడితో. "సాధకా. ఈ మహావీరుడు నేలబడి చావకుండా పట్టుకుని. తరవాత కావాలంటే నీ శూలంతో పొడిచి చంపు!" అని. విసిరివేశాడు.

సిద్ధసాధకుడు. సర్పనఖుణ్ణి గాలిలోనే పట్టుకోబోయే ప్రయత్నంలో అతడి చేతులకు వాడి మెడా. ఒక కాలూ దొరికినై. సాధకుడు పరమానందపడిపోతూ. సర్పనఖుణ్ణి గాలిలో గిరగిరా తిప్పి. "ఆహాఁ. వీడు మహాకాలుడికి ప్రశస్తమైన బలిపశువవుతాడు. సందేహం లేదు." అంటూ నేల మీద పడవేశాడు.

సర్పనఖుడు వెల్లికిలాపడి లేచి కూర్చుని. భయంతో గడగడ వణికిపోతూ. "అయ్యలారా. నన్ను చంపకండి. నేనూ. నా తమ్ముడు సర్పస్వరుడనేవాడూ కలిసి. మకరకేతు అనేవాణ్ణి వెతుకుతూ యీ ప్రాంతాలకు వచ్చాం. నా తమ్ముణ్ణి భయంకరమైన



నరవానరం ఎత్తుకుపోయింది. వాడింకా బతికేవుంటే, వాణ్ణి యీ అరణ్యంలో వెతికి పట్టుకుని, నా దారిన నేను పోతాను.'' అన్నాడు.

''సర్పనఖా, అలా దారికిరా,'' అని జయశీలుడు, సిద్ధసాధకుడితో, ''సాధకా, వీణ్ణి బలిపెట్టటానికి యింకా సమయం వున్నది. ప్రస్తుతానికి ఆగు,'' అని, సర్పనఖుడితో, ''ఒరే, నీ తమ్ముణ్ణి ఎత్తుకుపోయిన నరవానరం యజమాని కృపాణిజిత్తు యింకా బతికే వున్నాడు. వాడు నాకు శత్రువు. నీ తమ్ముణ్ణి వెతికే ప్రయత్నంలో నేను సాయపడతాను. కాని, నువ్వనే మాయాసరోవరేశ్వరుడుండే చోటుకు మమ్మల్ని తీసుకుపోతానని మాత్రం ముందుగా వాగ్దానం చెయ్యి.'' అన్నాడు.

''మాయాసరోవరేశ్వరుడుండే చోటుకు, ఆయన అనుమతి లేకుండా మానవమాత్రుడెవడూ ప్రాణాలతో చేర లేడు,'' అన్నాడు సర్పనఖుడు.

''అలా అయితే ఆ సరోవరం వున్న చోటేదో మాకు చెప్పు. అక్కడికి చేరే ప్రయత్నమేదో మేమే చేస్తాం. ఆ ప్రయత్నంలో మా ప్రాణాలు పోయినా నీవు బాధ్యుడివి కాదు. ఏమంటావు?'' అన్నాడు జయశీలుడు.

ఈ సారి సర్పనఖుడు వెలవెలపోతూ, గుడ్లు తేలవేసి, ''ఆ సరోవరం వున్న చోటు చెపితే, నా తల బద్దలవుతుంది. అలా అని శాపం!'' అన్నాడు.

''ఆ శాపమేదో నేనే అమలు చేస్తాను,'' అంటూ జయశీలుడు కత్తిని, సర్పనఖుడి తలకు గురిచేసేంతలో, దూరంగా కేకలు వినిపించినై. అందరూ తలలుతిప్పి అటు కేసి చూశారు.

కృపాణజిత్తు ఒక జలాశ్వాన్ని ఎక్కి, కత్తి తిప్పుతూ, ''జయశీలుడెక్కడ? వాడి నేస్తం కాపాలికుడెక్కడ? వాళ్ళను నా కత్తికి బలి పెడతాను,'' అంటూ జయశీలుడూ వాళ్ళున్న వైపుకు వేగంగా రాసాగాడు. —(ఇంకావుంది)






# ఒక్కనాటి స్వర్గం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు శ్రమ ఫలితాన్ని పొంది నప్పుడు అది నీకు తప్పక దక్కుతుంది. కొందరు యాదృచ్ఛికంగా, తాము చేసిన ప్రయత్నానికి వెయ్యి రెట్లు అధికమైన సత్ఫలితాన్ని పొందుతారు. అయితే అలాటివారు తమ అదృష్టాన్ని నిలుపుకో లేరు. అందుకు నిదర్శనంగా నీకు చిదంబరుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చిదంబరుడు అనేవాడు నిరుపేద వాడు. వాడు కట్టెలు కొట్టుకుని బతికే వాడు. కడుపునిండా తిండి కూడా ఎరగని

## బేతాళ కథలు



చిదంబరుడు అస్తమానమూ భోగభాగ్యాలను గురించి కలలు కనేవాడు.

ఒకసారి వాడు అడవిలో చెట్టు నరుకుతూండగా, దానికింద ఉన్న పుట్టలో నుంచి పాము ఒకటి బుస్సుమంటూ ఉవ్వెత్తుగా లేచింది. చిదంబరుడు ఎత్తిన గొడ్డలిని దాని మెడమీద వేశాడు. పాము తల తెగిపోయింది. వెంటనే అక్కడ ఒక దివ్య పురుషుడు ప్రత్యక్షమై, "చిదంబరుడా, నన్ను శాప విముక్తుణ్ణి చేశావు. ఒక ముని శపించగా సర్పాన్ని అయి, యీ పుట్టలో జీవిస్తున్న నేను ఒక యక్షుణ్ణి. ఏదైనా వరం కోరుకో, ఇస్తాను," అన్నాడు.

చిదంబరుడు యక్షుడికి నమస్కారం చేసి, "అయ్యా, నాలాటి పేదవాడికి తిండికన్న కావలసినది ఏముంటుంది? అయితే అది ఏదో విధంగా దొరుకుతూనే ఉన్నది. కాని, మనిషికి కష్టపడినా దొరకనివి చాలా వుంటాయి. దయచేసి నన్ను మీ లోకానికి తీసుకుపొండి. అక్కడ మీ వైభవాన్ని చూసి ఆనందిస్తాను," అన్నాడు.

కటిక దారిద్ర్యంలో ఉన్న చిదంబరుడు ధనధాన్యాలు కోరకుండా దేవలోకాన్ని చూడాలని కోరటం యక్షుడికి వింతగా తోచింది; అయినా మాట ఇచ్చాడు గనక వాడి కోరిక తీర్చదలచి, "సరే, అలాగే! కాని ఈ వేషంలో నువు మా లోకానికి రాకూడదు. నీకు కూడా ఒక యక్షుడి రూపం ఇచ్చి నా వెంట తీసుకుపోతాను అయితే నువు అక్కడ చాలా జాగ్రత్తగా మసులుకోవాలి. మానవ లక్షణాలు కనబడనియ్యకు. అజాగ్రత్తగా ఉన్నావంటే నీకూ, నాకూ కూడా మోసం వస్తుంది," అన్నాడు.

చిదంబరుడు సరేనన్నాడు. యక్షుడు వాణ్ణి యక్షుడుగా మార్చి, తమ లోకానికి తీసుకుపోయాడు.

ఆ లోకం చిదంబరుడికి అద్భుతమైన కలలాగా ఉన్నది. యక్షులూ, వాళ్ళ

సంపదా, స్వేచ్ఛా, భోగాలతో కూడిన జీవనమూ, విహారాలూ, యక్షకన్యల అందచందాలూ చూస్తూ ఉంటే, భూలోకంలో కోటీశ్వరులకు సైతం అలాటి జీవితం సాధ్యం కాదని చిదంబరుడికి అనిపించింది. ఎక్కడ చూసినా పాడేవాళ్లూ, నృత్యాలు చేసేవాళ్లూ, సంగీత వాద్యాలు వాయించేవాళ్లూనూ! భూలోకంలో వెయ్యేళ్ళు బతికేకంటే ఈ లోకంలో ఒక్కరోజు గడపటం మేలనుకున్నాడు చిదంబరుడు.

ఇంతలో ఒక యక్షిణి కిలకిలా నవ్వుతూ చిదంబరుణ్ణి సమీపించి, అతడి చెయ్యి పుచ్చుకుని, విహారానికి పోదాం రమ్మని పిలిచింది.

ఆమె అందాన్ని చూసి మతిపోయినట్టుగా అయి, చిదంబరుడు, "అబ్బ! ఎంత అందంగా ఉన్నావు! నీలాటి అందగత్తెలు మా లోకంలో మచ్చుకైనా కనిపించరు," అని నోరు జారి అనేశాడు.

వెంటనే ఆమె కోపంతో అతని చెయ్యి విసిరికొట్టి, "మూర్ఖుడా! ఎవరు నువు? యక్షుడి వేషంలో ఇక్కడ ఎందుకు తిరుగుతున్నావు?" అన్నది బుసలు కొట్టుతూ.

చిదంబరుడు భయంతో వణికిపోతూ, తనను తెచ్చిన యక్షుడి కోసం చుట్టూ చూశాడు. కాని అతని జాడలేదు. చేసేది లేక, చిదంబరుడు జరిగినదంతా యక్షిణికి చెప్పి, క్షమాపణ వేడుకుని, "బుద్ధి





గడ్డితిని, కోరరాని వరం కోరాను. నన్ను మా లోకానికి పంపేశావంటే బుద్ధిగా బతుకుతాను,'' అన్నాడు.

వెంటనే ఆమె శాంతించి, ''నువు ఒక యక్షుడికి శాప విమోచన కలిగించావు గనక నిన్ను క్షమిస్తున్నాను. ఈ సారి అయినా మంచి వరం కోరుకో,'' అన్నది.

''నా లాటి పేదవాడికి తిండికన్న సమస్య ఏముంటుంది ? రోజల్లా రెక్కలు ముక్కలు చేసుకున్నా నేనూ, నా భార్యా, బిడ్డలూ సుఖంగా ఇంత తినలేకుండా ఉన్నాం. మాకు జీవితాంతమూ సుఖమైన భోజనం కలిగేలాగు చెయ్యి,'' అన్నాడు చిదంబరుడు.

యక్షిణి అతనికి ఒక పాత్ర ఇచ్చి, ''ఇది అక్షయపాత్ర. ఏ క్షణంలో తినడానికి ఏం కావాలన్నా ఇది ఇస్తుంది. దీని సహాయంతో నీ కుటుంబం రాజోచితమైన భోజనాలు చెయ్యటమేగాక, కోరినంత మందికి విందులు చెయ్యవచ్చు. తినదగినదీ, తాగదగినదీ ఏది అడిగినా ఈ పాత్ర ఇస్తుంది. కాని అనుచితమైనది దీనినుంచి కోరావంటే నువు యథాస్థితికి వస్తావు, జాగ్రత్త!'' అన్నది.

చిదంబరుడు దాన్ని కళ్లకు అద్దుకుని, తిరిగి కళ్లు తెరిచేసరికి తన ఇంట్లో పక్క మీద పడుకుని ఉన్నాడు. అతను లేచి కూర్చుని తాను చూసినదంతా కలే కాబోలు ననుకున్నాడు. కాని అతని పక్కనే అక్షయ పాత్ర ఉన్నది! అతను దానికి దణ్ణంపెట్టి, పాయసమూ, లడ్డూలూ కోరేసరికి అవి వెంటనే ప్రత్యక్షమయాయి. చిదంబరుడి అనుభవం వట్టి కల కాదని తేలింది.

అక్షయపాత్ర మహిమ చిదంబరుడి భార్యకూ, పిల్లలకూ కూడా వెంటనే తెలిసింది. మర్నాటినుంచీ ఊళ్ళో ఉండే పేదసాదల కందరికీ తెలిసింది. తరవాత చుట్టుపక్కల అందరికీ అక్షయపాత్ర చేసే విందులు ముట్టాయి.

సంఘంలో చిదంబరుడి పరువు హెచ్చిపోయింది. అతనికి కొందరు గాఢమిత్రులు

కూడా ఏర్పడ్డారు. అతను అర్ధరాత్రిదాకా తిండి తినకుండా ఉండినా, వాళ్ళు కూడా ఉండి, అతనితో బాటే భోజనం చేసేందుకు కూర్చునేవారు.

ఒకరోజు రాత్రి చాలా పొద్దుపోయి చిదంబరుడూ, అతడి మిత్రులూ భోజనానికి కూర్చున్నప్పుడు, వాళ్ళు మద్యం కోరారు. అక్షయపాత్రను చిదంబరుడు మద్యం ఎన్నడూ అడిగి ఉండలేదు; కాని తన స్నేహితుల తృప్తి కోసం ఈరోజు అడిగాడు. వెంటనే అక్షయపాత్ర వాళ్ళు కోరినంత మద్యాన్ని ఇచ్చింది. తన స్నేహితులతో బాటు చిదంబరుడు కూడా తప్ప తాగాడు. అతని స్నేహితులు తూలుతూ నృత్యాలు చెయ్యసాగారు.

వెంటనే చిదంబరుడికి యక్షస్త్రీల నృత్యాలు జ్ఞాపకంవచ్చి, తన స్నేహితులతో వాటిని గురించి గొప్పగా చెప్పాడు. వాళ్ళు అతనితో, "మాక్కూడా యక్షిణుల నృత్యం చూపించరా! నువు తలుచుకుంటే అది సాధ్యంకాదా? ఏది అడిగినా ఇచ్చే అక్షయ పాత్ర ఒక యక్షిణిని పిలిచి నృత్యం చేయించలేదా?" అని బతిమాలారు.

తాగి ఉన్న మైకంలో చిదంబరుడికి వాళ్ళ కోరిక సబబుగానే కనిపించింది. అతను అక్షయపాత్రను వేడుకుంటూ ఒక యక్షిణిని ఇయ్యమన్నాడు. కాని అక్షయ పాత్ర ఏమీ చెయ్యలేదు. చిదంబరుడు దాన్ని ఎంత బతిమాలినా ప్రయోజనం లేకపోయింది. స్నేహితుల మధ్య అతనికి



తీరని అవమానం జరిగినట్టయింది. ఆవేశంలో అతను కర్ర తీసుకుని అక్షయ పాత్రను ఒక్కటి పెట్టాడు. అది ముక్కలు ముక్కలయింది.

మర్నాటినుంచీ చిదంబరుడు గొడ్డలి భుజాన పెట్టుకుని, కట్టెలు కొట్టి, తన కుటుంబాన్ని పోషించవలసినవాడైనాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మొట్టమొదట యక్షుడు వరం కోర మన్నప్పుడు తన తిండి సమస్యను లక్ష్య పెట్టని చిదంబరుడు, యక్షిణితో అదే తన జీవిత సమస్య అయినట్టు చెప్పి అక్షయ పాత్రను ఎందుకు తీసుకున్నాడు? అక్షయ పాత్రతో సమాజంలో ఎంతో పైకి వచ్చిన వాడు దానిమీద తన అహంకారం ఎందుకు చూపాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చిదంబరుడు తన జీవితం గురించి వాస్తవ దృక్పథం గలవాడు కాదు. అందుచేతనే వాడు కడుపునిండా తిండి లేకపోయినా భోగ భాగ్యాలను గురించి కలలుకనేవాడు. యక్షుడు తనను వరం కోరమన్నప్పుడు యక్షలోకం చూడాలని కోరుకున్నాడు. ఆవిధంగా వాడి కలలు పండాయనవచ్చు. కాని అంతలోనే వాడు యక్షిణి శాపానికి గురి అయే పరిస్థితి ఏర్పడి, స్వస్వరూప జ్ఞానం కలిగింది. అయితే, అక్షయపాత్ర వల్ల వాడు కోటీశ్వరుడి హోదా సమాజంలో సంపాదించ గలిగాడు. అప్పుడు వాడు తాను నిజంగా కోటీశ్వరుడినైపోయినా ననుకుని, కోటీశ్వరుడికి గాని చెల్లని మన స్తత్వం తెచ్చిపెట్టుకున్నాడు. నిజమైన కోటీశ్వరుడికి ఉండే భౌతికమైన ఆధారం వాడికి లేదు. వాడికున్న ఆధారం అక్షయ పాత్ర. ఆ మాట మరచి తన దురహంకా రాన్ని దానిమీదనే చూపి వాడు యథా స్థితికి వచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నిలకడలేని శిష్యుడు

కమలుడు తెలివి తేటలు గలవాడు. అయితే అతనికి ఉన్న ఊళ్ళో చదువు కోవటం పడలేదు. ఎందుకంటే, ఆ ఊళ్లో ఉన్న జీవనుడు అనే గురువుకు ఒక పద్ధతీ, నియమమూ లేదు. విద్యార్థులకు తోచినప్పుడు చదువు చెబుతాడు, ఝాము పొద్దెక్కి లేస్తాడు, రోజూ స్నానం కూడా చేయడు.

జీవనుడి దగ్గిర కమలుడు ఒకమాసం రోజులు చదువుకున్నాక, అతని తండ్రి అతన్ని పొరుగూళ్ళో బంధువుల ఇంట పెట్టి, మాతంగు డనే గురువు దగ్గిర చేర్చాడు. మాతంగుడి అలవాట్లు మంచివి. తన శిష్యులకు ఆయన మంచి అలవాట్లు బోధించేవాడు.

గురువు చెప్పిన ప్రకారం కమలుడు రోజూ కోడి కూసేవేళకు లేచి, కాల కృత్యాలు తీర్చుకుని, నదికి వెళ్ళి స్నానం చేసి, అనంతరం దేవాలయానికి వెళ్ళి ప్రార్థన చేసి, గురువుగారింటికి తిరిగి వచ్చేవాడు. అప్పటికి మాతంగుడు జపం చేసుకుంటూ ఉండేవాడు. జపం పూర్తి అయేసరికి రెండు గంటలు పట్టేది. తరవాత ఆయన భోజనం చేసి విశ్రమించేవాడు. సాయంకాలం మాతంగుడికి మరి కొంత తతంగం ఉండేది. అది పూర్తి అయే సరికి రాత్రి భోజనాలవేళ అయేది. కమలుడు వెళ్ళి భోజనం చేసి వచ్చేవాడు. భోజనం చేసిన వెంటనే చదువు కోవటం ఏ మాత్రం మంచిది కాదనేవాడు గురువుగారు. తరవాత కొద్దిసేపటికల్లా నిద్రాసమయమయేది. ఇదీ కమలుడి దిన చర్య.

"చదువు సరిగా కొనసాగడం లేదని దిగులుపడవద్దు. శరీరాన్ని నియమాలతో క్రమశిక్షణలో ఉంచితే, చదువు దానం



తట అదే వస్తుంది.'' అనేవాడు మాతంగుడు.

మాతంగుడి శిష్యులకు చదువు దానంతట అదే రావాలి గాని, ఆయన చెప్పడని తేలిపోయింది. రెండు నెలలు గడిచాక కమలుణ్ణి అతని తండ్రి మరో గ్రామం తీసుకుపోయి, అక్కడ బంధువుల ఇంట పెట్టాడు.

ఆ గ్రామంలో కమలుడు శ్రీపాణి అనే గురువు దగ్గిర చేరాడు. ఆయనకు మంచి అలవాట్లు ఉన్నాయి, కాని చాదస్తం లేదు. పూజలు చేస్తాడు గాని రోజల్లా చేయడు. ఆయన కమలుడితో ఇలా అన్నాడు :

''గురువంటే దేవుడితో సమానం. దేవుడికి దండం పెడితే పాపాలన్నీ నశించి పుణ్యం వచ్చినట్టే, గురువుకు శ్రద్ధగా, పగలనక, రాత్రనక శుశ్రూష చేస్తుంటే చదువు దానంతట అదే వచ్చేస్తుంది.''

కమలుడు గురుశుశ్రూష చేశాడు. ఉదయం లేవగానే గురువుగారి పూజా మందిరం శుభ్రం చేసి, పూజకు అన్నీ సిద్ధంచేసి, ఆయన పూజలో ఉండగా అవుపాలు పితికి గురుపత్నికి ఇచ్చేవాడు. ఆవిడ పనులు చేసుకుంటూంటే వాళ్ళ ఆఖరు పిల్లను ఆడించేవాడు. తరవాత సంతకు వెళ్ళి, వెచ్చాలు తెచ్చేవాడు. ఆ తరవాత గురువుగారి పొలానికి వెళ్ళి, అక్కడ పొలం మీద అజమాయిషీ చేసేవాడు. అతని మధ్యాహ్న భోజనం పొలానికే వచ్చేది. పూర్తిగా అలసిపోయి సాయంత్రం అతను ఇల్లు చేరేవాడు. ఆ సంగతి గుర్తించి శ్రీపాణి అతని కోసం ఉడుకు నీళ్ళు సిద్ధం చేయించి ఉంచేవాడు. సుఖంగా స్నానంచేసి, కమలుడు భోజనం చేసేవాడు. తరవాత గురువుగారు పడుకుంటే, కమలుడు అతనికి ఒళ్ళు పట్టుతూ, గురుశుశ్రూషచేసి మహాజ్ఞానులైనవారి కథలు గురువు చెప్పగా శ్రద్ధగా వినేవాడు.

ఇక్కడ కూడా చదువు దానంతట అదేరావాలి తప్ప ఎవరూ చెప్పరని కమలుడికి అర్థమయింది. అతన్ని తండ్రి మరో గ్రామంలో ఉన్న గురుకులానికి పంపాడు. ఈ గురుకులాన్ని నడిపే శంకరుడు మంచి అలవాట్లు గలవాడే. అయనకు శుశ్రూషలు చేయించుకోవాలన్న పట్టింపు కూడాలేదు. కాని అయన మహా ముక్కోపి. శిష్యుల మీద కోపంవస్తే వాళ్ళచేత రెండు మాసాలపాటు తోటపని చేయించి, చదువు చెప్పేవాడు కాదు. కమలుడు గురుకులంలో అడుగు పెట్టే నాటికి శంకరుడి శిష్యులందరూ తోటపనే చేస్తున్నారు. చేరిన రెండు రోజులకు అతను కూడా తోటపనిలో ప్రవేశించాడు.

ఈ తోటపనికి హద్దు ఉండేటట్టు లేదు. ఎందుకంటే ఆ తోటపని సరిగా చెయ్యటం లేదని గురువు, శిష్యుల శిక్షను పొడిగించేవాడు.

ఈవిధంగా జీవితమంతా తోటపనిలోనే గడిచిపోతుందని కమలుడికి తోచింది. అతను ఈసారి తానే నిర్ణయం తీసుకుని, గురుకులాన్ని వదిలిపెట్టి, ఇంకో గ్రామానికి పోయి, అక్కడ సుగాత్రుడనే గురువు దగ్గిర చేరాడు.

సుగాత్రుడు సంగీత ప్రియుడు. అయన తన గురువుగారి వద్ద తంబురా వాయించి, సంగీతమంతా తానే నేర్చుకున్నాడట. అయన కమలుడికి తంబురా ఇచ్చి తాను పాడసాగాడు....



రెండు సంవత్సరాల పాటు కమలుడు చాలా గ్రామాలు తిరిగాడు. ప్రతి చోటా అతనికి చదువు దానంతట అదే రావలసిన అవసరం కనిపించింది. అతను తన గ్రామానికే తిరిగి పోదామనుకున్నాడు గాని, అక్కడి గురువుకు ఒక పద్ధతీ, పాడూ బొత్తిగాలేదని గుర్తుకు వచ్చి, ఆ ఉద్దేశం మార్చుకున్నాడు.

ఈలోగా కమలుడు ఉన్నగ్రామానికి ఎవరో యువకుడు వచ్చి, వేదాంతోపన్యాసాలు ఇస్తున్నట్టు తెలిసింది. కమలుడు కూడా ఉపన్యాసం వినటానికి వెళ్ళాడు. ఉపన్యాసం చాలా ధారాళంగా సాగింది. కాని ఆ కుర్రవాణ్ణి అభినందించుదామని కమలుడు దగ్గిరికి వెళ్ళి చూస్తే, అతను ఎవరో కాదు! తన గ్రామానికే చెందిన మాధవుడు! ఇద్దరూ ఒకరి నొకరు గుర్తించి కౌగలించుకున్నారు.

''నా విద్యాభ్యాసం ముగిసింది. దాన్ని విస్తృతపరచుకోవడానికి ఒక సంవత్సరం పాటు ఊరూరా తిరిగి ఉపన్యాసాలియ్యమని గురువుగారు చెప్పారు,'' అన్నాడు మాధవుడు.

కమలుడు ఆశ్చర్యంగా, "రెండు సంవత్సరాల క్రితం నీకు అక్షరజ్ఞానంమాత్రమే ఉండేది. ఇంత కొద్దికాలంలో నీకు ఇంత విజ్ఞానం ప్రసాదించిన నీగురువు ఎవరు?" అని అడిగాడు.

''రెండు సంవత్సరాలంటే కొన్ని వందల రోజులు గదా, అది కొద్ది వ్యవధి ఎలా అవుతుంది? నీకు తెలుసు గదా, జీవనుడే నాకు గురువు. నువు కూడా చాలా జ్ఞానం సంపాదించి ఉంటావు,'' అన్నాడు మాధవుడు.

''మంచి గురువు కోసం వెతుకుతూ మంచి అలవాట్లు నేర్చుకున్నాను. ఇంటి పనులూ, పొలం పనులూ, తోటపనులూ నేర్చుకున్నాను. తంబురా మీటడం నేర్చుకున్నాను. పెద్దలకు సేవలు చెయ్యడం నేర్చుకున్నాను. ఇక వెళ్ళి జీవనుడి వద్ద చదువు నేర్చుకుంటాను,'' అన్నాడు కమలుడు.



# ఎవడు అదృష్టవంతుడు?

ఒక నవాబుకు ఇద్దరు కొడుకులు. వారి గురువైన మౌల్వీ వారి గురుభక్తి పరీక్షించటానికి తన చెప్పులు ఫలాని చోట ఉన్నాయనీ, వాటిని తెమ్మనీ అడిగాడు.

వెంటనే ఇద్దరూ చెప్పులున్న చోటికి పరిగెత్తుకుంటూ వెళ్ళి, కొంచెంసేపు నేనంటే నేనని పోట్లాడుకుని, చివరకు రాజీపడి, చెరొక చెప్పు తెచ్చారు.

ఈ సంగతి నవాబుకు తెలిసింది. ఆయన మౌల్వీగారిని పిలిపించి, అదీ ఇదీ మాట్లాడి, "ఈ రోజుల్లో ప్రపంచంలో ఎవరు ఎక్కువ అదృష్టవంతులో చెప్పగలరా?" అని అడిగాడు.

"ఏలిన వారిని మించిన అదృష్టం ఎవరికుంటుంది?" అన్నాడు మౌల్వీ.

"అలా కాదు. ఎవరి చెప్పులు మొయ్యటానికి ఇద్దరు నవాబుబిడ్డలు కొట్టుకుంటారో వాడు కదా అదృష్టవంతుడు?" అన్నాడు నవాబు.

"అలాటి సుపుత్రులను కన్న ఆ నవాబు ఇంకెంతటి అదృష్టవంతుడో కదా!" అన్నాడు మౌల్వీ.

నవాబు మెచ్చుకుని, మౌల్వీకి బహుమానం ఇచ్చి పంపాడు. —అన్వర్.





# సమయస్ఫూర్తి

చాలా కాలం క్రితం, ఆల్ప్స్ పర్వతాల మంచులోయలో మంచుదేశం అనే దేశం ఉండేది. అక్కడి ప్రకృతిసౌందర్యం వర్ణనాతీతంగా ఉండేది. ఓమస్ అనే రాజు ఆ దేశాన్ని పాలించేవాడు. ఆయనకు మగపిల్లలులేరు. ఆయన ఏకపుత్రిక స్నోవైట్, గొప్ప సౌందర్యవతి. ఆమె పద్ధెనిమిదవ ఏట ఆమె తండ్రి మరణించి, ఆమెను ఏకాకిని చేశాడు. అయినా ఆమె కుంగిపోలేదు. ఆమె తెలివితేటలు గలది. రాజ్యపాలనకు కావలిసిన విద్యలన్నీ తండ్రి ఉండగానే పొందింది.

ఆమె అందం గురించి విని చుట్టుపక్కల అనేకమంది రాజకుమారులు ఆమెను పెళ్ళాడతామని వచ్చారు. అయితే ఆమె తన వివాహానికి ఒక షరతు పెట్టింది. తనను వరించి వచ్చినవాడు ఒక పరీక్షలో నెగ్గాలి. అతన్ని రాజకుమార్తె తనతోపాటు భోజనానికి కూర్చొబెట్టి, షడ్రసోపేతంగా భోజనం పెట్టేది. భోజనానంతరం ఒక ప్లేటులో మంచుగడ్డ అతని ముందు పెట్టి, అతని చేతికి ఒక దారం ఇచ్చి, దాన్ని మంచుగడ్డకు కట్టకుండా, దాని సహాయంతో మంచుగడ్డను పైకి ఎత్తమనేది; పెళ్ళాడ వచ్చినవాడు దారం కొసను మంచుగడ్డ పైభాగానికి అంటించి, అందుకుగాను మంచుపొడి ఉపయోగించి, మంచుగడ్డను పైకి ఎత్తాలి. మంచుపొడి పక్కనే ఒక చిన్న పాత్రలో ఉండేది.

పెళ్ళాడవచ్చిన వారందరూ ఈ పరీక్షలో ఓడారు. వాళ్ళు చేయలేని పని తాను చేయగలనని స్నోవైట్ చూపింది. ఓడిన రాజకుమారులు తిరిగిపోలేదు. నియమం ప్రకారం వాళ్ళు స్నోవైట్ రాజభవనంలో బందీలుగా ఉండిపోయారు.

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



రాజు చనిపోయి ఏడాది గడిచింది. అనేకమంది రాజకుమారులు స్నోవైట్‌ను పెళ్ళాడగోరివచ్చి, పరీక్షలో ఓడి, ఆమెకు బందీలు అయారు. మంచుదేశం మంత్రి వృద్ధుడయాడు. త్వరగా స్నోవైట్ వివాహం జరగాలని ఆయన కోరిక. కాని ఆయన నిస్సహాయుడు. స్నోవైట్ నిర్ణయం అమలు జరిగితీరాలి.

మంచుదేశానికి కొంత దూరంలో ఒక దేశం ఉన్నది. దాని రాజకుమారుడు జాన్ అంటే మంత్రికి అభిమానం. జాన్ అందగాడూ, గంభీరస్వభావంగలవాడూ, విద్యావంతుడూ, అన్నిటినిమించి శూరుడూనూ. జాన్ కూడా వచ్చి పరీక్షకు నిలబడతానన్నప్పుడు, మంత్రి అతన్ని వారిస్తూ, తొందరపడవద్దన్నాడు; అతను పరీక్షలో నెగ్గే అవకాశం ఏర్పడినదాకా వేచి ఉండమన్నాడు.

కాలక్రమాన మంత్రికి, స్నోవైట్ తన పరీక్షలో ఎలా నెగ్గుతున్నదీ తెలిసి వచ్చింది. ఆయన ఆ రహస్యాన్ని రాజకుమారుడు జాన్‌కు తెలియజేసి, పరీక్షకు రమ్మన్నాడు.

ఒకనాడు జాన్ వచ్చి, స్నోవైట్‌ను కలుసుకుని, తాను ఆమెను పెళ్ళాడగోరి వచ్చినట్టు చెప్పాడు. అతన్ని భోజనశాలకు తీసుకుపోయారు. విందుభోజనం ముగిసినాక, మంచుగడ్డను తెచ్చి జాన్ ముందు ఉంచి, అతని చేతికి దారం ఇచ్చారు.

"రాజకుమారా, ఈ దారం సహాయంతో ఈ మంచుగడ్డను పైకి ఎత్తరేది," అన్నది స్నోవైట్. జాన్ దారాన్ని మంచుగడ్డ కిందిగా పోనిచ్చి, దానితో మంచుగడ్డను కట్టబోయాడు.

"అలాకాదు! మంచుగడ్డను దారంతో కట్టకుండానూ, దారాన్ని మంచుగడ్డ చుట్టూ ఉచ్చులాగా వెయ్యకుండానూ ఎత్తాలి. దారం కొస మంచుగడ్డ మీద పెట్టి, ఎత్తాలి. కావలిస్తే దారాన్ని మంచు గడ్డకు అతికించటానికి మంచుపొడి ఉపయోగించవచ్చు," అన్నది స్నోవైట్.

"ఆ మాట ముందు చెప్పలేదు. ఈసారి ప్రయత్నిస్తాను,'' అన్నాడు జాన్.

మంచుపొడి ఉన్న పాత్ర అతని ముందుకు తోశారు. ఈలోపల అతను తన కుడిచెయ్యి తన ఒడి నుంచి పైకితీసి, చప్పున మంచుపొడిలో ముంచి, మంచు గడ్డ మీద ఉన్న దారం కొస మీద నొక్కాడు. ఆ తరవాత మరింత మంచుపొడి తీసుకుని దానిమీద మళ్ళీ అంటించాడు.

''పరీక్షలో నేను గెలిస్తే, నీ మాట నిలబెట్టుకుని, నన్ను నీ భర్తగా స్వీకరిస్తావా ?'' అని జాన్ ఆమెను అడిగాడు.

''తప్పకుండా ! అది చనిపోయిన నా తండ్రి మీద ప్రమాణంచేసి చేసిన వాగ్దానం,'' అన్నది స్నోవైట్.

ఒక్క నిమిషం ఇలా జరగనిచ్చి, జాన్ దారం పట్టుకుని అతిజాగ్రత్తగా పైకి ఎత్తాడు. దానితోబాటు మంచుగడ్డ కూడా లేచింది. స్నోవైట్ చెక్కిళ్లు ఎర్రబడ్డాయి. ఆమె తన ముఖాన్ని చేతులతో కప్పుకుని, అక్కడినుంచి వెళ్ళిపోయింది.

జాన్‌కూ, స్నోవైట్‌కూ మహావైభవంగా పెళ్ళిజరిగింది. బందీలందరూ విడుదల అయి, పెళ్ళివేడుకలలో పాల్గొన్నారు. తరవాత వాళ్ళు జాన్‌కు అభినందనలు తెలిపి, తమతమ దేశాలకు వెళ్లిపోయారు.

పెళ్ళి అయాక స్నోవైట్ తన భర్తతో, ''నా పెళ్ళికి ఈ పరీక్ష ఎందుకుపెట్టానో తెలుసా? చురుకైనబుర్రా, సమయస్ఫూర్తి కలవాణ్ణే పెళ్ళాడాలని! ఆ రెండూ నీలో ఉన్నాయి,'' అన్నది.

ఈ మెప్పు జాన్‌కు రుచించలేదు. మంత్రి చెప్పిన ప్రకారం అతను కొంత ఉప్పు తన దుస్తులలో దాచుకుని, దాన్ని ఒక చిటికెడు తీసుకుని, చెయ్యి మంచు పొడిలో ముంచినట్టుముంచి, ఆ ఉప్పును దారం కొస మీద అద్దాడు. దానితో దారం కొస మంచుగడ్డకు బిగుసుకుపోయింది.

మూడేళ్లు స్నోవైట్‌తో సుఖంగా కాపరం చేసిన తరవాతనే అతను ఈ సంగతి బయటపెట్టాడు. స్నోవైట్ కోపం అభినయిస్తూనే అతని కేసి ప్రేమగా చూసింది.





# అన్నింటికంటే నీచవృత్తి

పూర్వం వైశాలీనగరంలో రంగిశెట్టి అనే కిరాణావ్యాపారి ఉండేవాడు. వ్యాపారం మీద శెట్టికి సుఖంగా జరుగుబాటు కావటమేగాక, కొంత మిగులుతూండేది కూడా. అయినా శెట్టికి తన "బెల్లం, చింతపండు" వ్యాపారం ఎదుగూ బొదుగూ లేని వ్యాపారంగా కనబడి, కోటీశ్వరుడు కావటానికి ఇంకేదన్నా వృత్తి చేపట్టాలనిపించింది.

శెట్టి బుద్ధి ఇలా పెడతోవనపడుతూండగా, అతని పక్కవీధిలో ఉన్న ఒక లక్షాధికారి ఇంట దొంగలు పడి, లక్ష వరహాలు విలువచేసే వెండీ, బంగారమూ ఎత్తుకుపోయారు. అలాంటి దొంగతనం ఒక్కటిచేస్తే జీవితాంతం హాయిగా బతకవచ్చు ననిపించింది శెట్టికి.

తాను దొంగతనం చెయ్యాలంటే ముందుగా దొంగలను పరిచయం చేసుకోవాలి, ఆ వృత్తిలో సాధకబాధకాలు తెలుసుకోవాలి. దొంగలు రాత్రిపూట సమావేశమయే స్థలాల కోసం వెతికి, చివరకు శెట్టి, ఊరిబయట పాడుబడిన శివాలయం దగ్గిర అర్ధరాత్రిపూట కొందరు దొంగలు చేరుతూంటారని తెలుసుకుని, అర్ధరాత్రికి ముందే అక్కడికి వెళ్ళి ఆలయం అరుగు మీద పడుకుని నిద్ర పోతున్నట్టు నటించుతూ, దొంగల సంభాషణ ఆలకించసాగాడు.

శెట్టికి ఆశ్చర్యంవేసింది. దొంగలకు ఎంత ధైర్యసాహసాలు కావాలి, ఎంత దూరదృష్టి ఉండాలి!

రోజూ రంగిశెట్టిని అరుగు మీద చూస్తున్న దొంగలకు, అతను ఎవరో దిక్కులేనివాడనీ, తమకు ఎప్పుడైనా అవసరంవస్తే ఉపయోగపడవచ్చుననీ అనిపించింది.

ఎం. డి. సౌజన్య



ఒకరోజు అర్ధరాత్రి ఇద్దరు దొంగలు చెరొక కావడీ మోసుకొచ్చారు. వారిలో ఒకడు చిన్నవాడు, రెండోవాడు పెద్దవాడు. చిన్నవాడు దొంగనిద్ర నటిస్తున్న శెట్టిని లేపి, "మా మనిషి ఒకడు రాలేదు. మాతో వస్తావా? నీకు తగినంత ముట్ట జెప్పుతాంలే! మా పని నీకు కొత్త అని భయపడవలసినపనిలేదు. మేం చెప్పి నట్టు చేస్తేచాలు. నిన్ను కాపాడే పూచీ మాది!" అన్నాడు.

అటువంటి అవకాశం కోసమే ఎదురు చూస్తున్న రంగిశెట్టి ఒప్పుకున్నాడు.

దొంగలు ముందు శెట్టి అవతారం మార్చేశారు: అతని చొక్కా విప్పేసి, తలకు తలగుడ్డ చుట్టి, ముఖానికి మసి పులిమి, చిన్నగడ్డం అంటించి, బట్ట ఎగ కట్టించి, చేతికి కర్ర ఇచ్చి, నెత్తిన గోతపు సంచీ పెట్టి, చేతికి ఏడెనిమిది బెల్లపు గడ్డలు ఇచ్చి, "ఇక పద!" అన్నారు.

దొంగతనానికి పోవాలంటే ఇంత తతంగం ఉన్నదని శెట్టికి తెలియదు. తనని దొంగలు ఒక రైతుగా మార్చేశారు. ఈ రూపంలో తనను చూసి తన భార్య కూడా గుర్తించలేదు.

ఇలా ఆలోచించుకుంటూ పోతున్న శెట్టి చీకట్లో చూడక, దారిలో పడుకుని ఉన్న ఒక వీధికుక్క తోక తొక్కాడు. అది గట్టిగా మొరగడం ప్రారంభించింది. శెట్టి ఒక్క సారిగా అదురుకుని "అమ్మో!" అంటూ చేతిలోని బెల్లపుగడ్డలు జారవిడిచాడు. కుక్క మొరగడం ఆపి, బెల్లపుగడ్డలను నాకనారంభించింది.

పెద్దదొంగ శెట్టితో, "మనం వెళు తున్నది దొంగతనానికి, నాయనా! పెండ్లి భోజనానికి కాదు. కొంచెం జాగర్తగా ఉండాలి," అని శెట్టికి మరికొన్ని బెల్లపు ఉండలు ఇచ్చాడు.

చిన్నదొంగ శెట్టితో, "కుక్క అరవ టమూ, వెంటనే మానటమూ కొత్వాలు గమనిస్తాడు. అతను రాకమానడు. వచ్చి రకరకాల ప్రశ్నలు వేస్తాడు. మనని

ఏమార్చి బుట్టలో వెయ్యటానికి ప్రయత్నిస్తాడు. నువు నోరెత్తకు. అన్ని ప్రశ్నలకూ నేనే సమాధానం చెబుతాను,'' అన్నాడు.

చిన్నదొంగ ఊహించినట్టే కొత్వాలు గుర్రం మీద అటుగా వచ్చాడు. అతను కోపంగా, ''ఎవర్రా మీరు? అర్ధరాత్రి ఇలా వీధులవెంట తిరగరాదని తెలీదా? ఈవేళప్పుడు ఏం పని మీద బయలుదేరారు? నిజంచెప్పండి,''అని గద్దించాడు.

కొత్వాలు గొంతు వింటుంటేనే శెట్టికి గుండెల్లో అదురుపుట్టింది.

''ఛీ, ఛీ! క్షణక్షణమూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బతికే ఈ వృత్తి ఏం వృత్తి? ఇందులో ఎంతలాభం ఉంటే మటుకేం? ఇంతకుముందు ఈ కొత్వాలు కాదుగదా, ఇంతకన్న పెద్ద అధికారిని చూసి కూడా ఎన్నడూ భయపడలేదే,'' అనుకున్నాడు శెట్టి.

చిన్నదొంగ కొత్వాలుతో, ''మాది పక్క గ్రామం రామాపురం, దొరా! బెల్లపు ఉండలు అమ్ముకుందామని కావళ్లు వేసుకొచ్చాం. ఈ చీకట్లో సత్రందారి తెలీక వీధులన్నీ తిరుగుతున్నాం. సత్రందారి చూపించి పుణ్యంకట్టుకోండి,'' అన్నాడు ఎంతో అమాయికంగా.

''సత్రందారి చెబుతాను. ముందు మీ పేర్లు చెప్పండి. ఈ బొర్రవాడెవడు?



కాయకష్టం చేసేవాడులాగా లేడే!'' అన్నాడు కొత్వాలు శెట్టిని చూసి.

శెట్టికి గుండె దడపుట్టింది.

''నా పేరు రాములండి. వీడు మా అన్న కిష్టయ్య. ఈయన మా రు బేరగాడు మంగయ్య. కాయకష్టం చెయ్యకుండానే లాభాలు తిని బొర్ర పెంచాడు,'' అన్నాడు చిన్నదొంగ.

కొత్వాలు నవ్వి, సత్రందారి చెప్పి, ''ఓ ఘడియలో సత్రం కేసి వస్తాను. మీరు ముగ్గురూ ఉన్నారో, లేదో చూస్తాను. జాగ్రత్త! వెళ్ళండి,'' అన్నాడు.

బ్రతుకు జీవుడా అనుకుంటూ, ముగ్గురూ ముందుకు సాగారు దొంగ

తనానికి. ఇప్పటికి శెట్టికి దొంగవృత్తి మీద పూర్తిగా ఏవగింపుకలిగింది. అడుగడుగునా అబద్ధాలు! క్షణక్షణం భయం! ఇంకా దొంగతనం చెయ్యకమునుపే ఇలా ఉంటే, వృత్తి చేపట్టినాక మనశ్శాంతి పూర్తిగా పోవడం ఖాయం. "చచ్చినా ఈ వృత్తి లోకి దిగరాదు. ఎలాగైనా ఇక్కడి నుంచి తప్పించుకు పోవాలి!" అనుకున్నాడు శెట్టి.

ముగ్గురూ ఒక పెద్ద ఇంటి ముందు ఆగారు. అదే వాళ్లు కొల్లగొట్టదలచుకున్న ఇల్లు.

"నేను తాళం పగలగొట్టుతాను. మనిద్దరమూ లోపల పనిముగించుకుని వచ్చేదాకా ఇతను బయట కాపలా ఉంటాడు," అని కూడబలుక్కుని దొంగలు తాళం పగలగొట్టి లోపలికి వెళ్ళారు.

వెంటనే రంగిశెట్టి అక్కడినుంచి కదిలి, తన ఇంటికి బయలుదేరాడు. అతను తమ వీధిమలుపు తిరుగుతూండగా రాజభటులు ఒక దొంగను పెడరెక్కలు విరిచికట్టి, కొరడాలతో బాదుతూ చెరసాల కేసి తీసుకుపోతూ కనిపించారు. దొంగ వెంట వాడి భార్యా, పిల్లలూ గోలగా ఏడుస్తూ పోతున్నారు. ఆ తెల్లవారవచ్చే సమయంలో ఇదిచూసిన గ్రామస్థులెవరూ, ''అయ్యో, పాపం!'' అనలేదు.

శెట్టికి ఆ దొంగ మీద కొండంత జాలి వేసింది. ''ఇదేం వృత్తోగాని, పట్టుబడ్డ వాణ్ణి ఎంత శిక్షించినా లోకం ఇంకా శిక్షించాలనే అనుకుంటుంది. నేను పట్టుబడినా నా గతీ ఇంతేగదా!" అనుకున్నాడు అతను.

శెట్టి దొడ్డిదారిన లోపలికి వెళ్ళి, తన వేషం పూర్తిగా కడిగేసుకుని, ప్రశాంత మనస్సుతో తన ఇంటి అరుగు మీద పడుకున్నాడు.

బాగా తెల్లవారినా నిద్రలేవని శెట్టిని అతని భార్య లేపి, కొత్వాలు ఇద్దరు దొంగలను తెల్లవారుఝామున పారిపోతుంటే, వెంటతరిమి కత్తులతో చంపిన వార్త చెప్పింది.



# లాభం - నష్టం

ధనగుప్తుడు అనే వర్తకుడికి రామగుప్తుడూ, శ్యామగుప్తుడూ అని ఇద్దరు కొడుకులుండేవారు. వ్యాపారంలో లక్షలు కూడబెట్టిన ధనగుప్తుడు నడి వయసులో వ్యవసాయం మీదికి బుద్ధి మళ్ళి, ఒక వంద ఎకరాలను కొని, వ్యవసాయంలో కూడా బాగా ఆర్జించాడు. అతనికి వృద్ధాప్యం వచ్చేసింది. తన కొడుకులలో ఒకడికి వర్తకమూ, రెండోవాడికి వ్యవసాయమూ ఇద్దామను కున్నాడు. కాని ఏది ఎవరికియ్యాలి?

ధనగుప్తుడు తన కొడుకులిద్దరికీ వెయ్యేసి వరహాలిచ్చి, "దీనితో మీరు వర్తకపు సరుకులు కొని, మీ ఇష్టం వచ్చిన దిక్కుగా పోయి, లాభానికి అమ్ముకురండి," అన్నాడు.

పెద్దవాడు ఆహార ధాన్యాలు చౌకగా దొరికిన చోట కొని, వాటికి గిరాకీ ఉన్న ప్రాంతాలకు వెళ్ళి అమ్మి, సంబరపడుతూ తిరిగివచ్చి, తన పెట్టుబడికి సమమైన లాభం సంపాదించానని, రెండు వేల వరహాలు తండ్రికి చూపాడు.

రెండోవాడు నిరుత్సాహంగా తిరిగివచ్చి, "నాకు అనుభవం చాలక వెయ్యి వరహాలను నాలుగువేల వరహాలు మాత్రమే చెయ్యగలిగాను," అని విచారంగా తండ్రికి చెప్పాడు.

ధనగుప్తుడు పెద్దవాడికి వ్యవసాయమూ, రెండోవాడికి వర్తకమూ ఇచ్చాడు.

—గంగిశెట్టి శివకుమార్.



కామయ్య ఒక పెంపుడు కుక్కను పెంచసాగాడు. అది తెల్లవార్లూ అరుస్తుంది, అందరినీ తరుముకొస్తుంది. ఒక రోజు అది సోమయ్య కూతురు గంగని తరుముకొచ్చింది. ఆ కుక్కను చూస్తే సోమయ్యకే భయంగా ఉండేది. దాని బాధ ఎలా వదులుతుందా అని సోమయ్య ఆలోచించాడు.

అతను కామయ్య వద్దకు వెళ్ళి, "నీవల్ల నాకు మంచి ఉపకారం జరిగిందయ్యా," అన్నాడు.

తనవల్ల ఎవరికైనా ఉపకారం జరిగిందంటే కామయ్యకు కంపరంగా ఉంటుంది. "ఏమిటది?" అని అతను అడిగాడు.

"నిన్నరాత్రి మా యింటికి దొంగలు వచ్చి కన్నం వెయ్యసాగారు. నీ కుక్క అరిచింది. నేను లేచి వచ్చేసరికి, నన్ను చూసి దొంగలు పారిపోయారు," అన్నాడు సోమయ్య.

కామయ్యకు మండిపోయింది. తాను కుక్కను కొని పోషిస్తున్నది సోమయ్య ఇంటి కాపలాకా? ఆ రోజే కామయ్య ఆ కుక్కను అమ్మేశాడు.

సోమయ్య గంగకు సంబంధాలు చూస్తున్నాడని తెలిసి విఠల్ వచ్చి, ఆమెను తాను చేసుకుంటానన్నాడు.

"మీ నాన్న ఒప్పుకోడు. నేను కట్నాలు ఇచ్చుకునే తాహతు లేనివాణ్ణి," అన్నాడు సోమయ్య.



''పోట్లాడి అయినా నేను చేసుకుని తీరుతాను,'' అన్నాడు విఠల్ ఆవేశంగా.

''తొందరపడకు. ఉపాయం ఆలోచింతాం,'' అన్నాడు సోమయ్య.

ఒకనాడు సోమయ్య తన ఇంటికి మామిడి తోరణాలు కట్టుతూంటే, పొలం నుంచి వస్తున్న కామయ్య, ''ఏమిటి విశేషం?'' అని అడిగాడు.

''మొన్న విశాలపురం తీర్థానికి వెళ్లినప్పుడు, జమీందారుగారి తమ్ముడు గంగని చూసి, పెళ్ళి చేసుకుంటానన్నాడు. ఇవాళ వాళ్లు పెళ్లి చూపులకు వస్తున్నారు,'' అన్నాడు సోమయ్య.

మధ్యాన్నం గుర్రాల మీదా, మేనాల మీదా పెళ్లి వారు వచ్చారు. రకరకాల కానుకలు తెచ్చారు. బ్రాహ్మణులకు ఘనంగా దక్షిణలిచ్చారు. పెళ్ళిచూపులు అయాక, వెళ్ళి కబురు చేస్తామని వెళ్ళిపోయారు.

కామయ్య గుండెల్లో రాయి పడింది. ఈ సంబంధం జరిగితే సోమయ్య తన కన్ను ఎదిగిపోయి, తనను పురుగును చూసినట్టు చూస్తాడు. జమీందార్లకు పనికివచ్చిన గంగ తమ ఇంటికి ఎందుకు పనికి రాదు?

కామయ్య చాలాసేపు మథనపడి, చివరకు సోమయ్య దగ్గిరికివచ్చి, ''మనం ఆ బాల్యస్నేహితులం. మా అబ్బాయికి మీ అమ్మాయిని చేసుకుంటే వియ్యం కూడా ఏర్పడి మన మధ్య బంధం దృఢమవుతుంది,'' అన్నాడు.

''నేను మీతో తూగగలనా?'' అన్నాడు సోమయ్య.

కామయ్య ముఖ్య ఆశయం ఆ జమీందారు సంబంధాన్ని చెడగొట్టడమే. ఖర్చులన్నీ తనే పెట్టుకుని పెళ్ళి జరిపిస్తానని, అతను సోమయ్యను ఒప్పించాడు.

విఠల్ తన తండ్రికి తెలియకుండా వెయ్యి రూపాయలు ఖర్చుచేసి ఆడించిన మాయజమీందారు నాటకంతో అవివేకి కామయ్య పూర్తిగా మోసపోయాడు. విఠల్‌కూ, గంగకూ పెళ్లి జరిగిపోయింది.





# నాటకాల రాయుడు

సంపాదించవలసిన వయసులో సుబ్బారాయుడు ఇంకా చదువుకుంటూ ఉండటమే గాక, నాటకాలపిచ్చి మూలంగా వాడు చదువు ఎగగొట్టి, కొన్ని రాత్రులు అసలు ఇంటికే వచ్చేవాడు కాడు.

మొదట్లో వాడి తల్లిదండ్రులకు ఈ సంగతి తెలియదు. ఒకసారి ఉపాధ్యాయుడు సుబ్బారాయుడి తండ్రితో, "మీ వాడు చదువు పూర్తిగా మానేసి, నాటకాలలో అభ్యాసానికి పోతున్నాడు. మీరు వాణ్ణి ఇప్పుడే అదుపులో పెట్టకపోతే, తరవాత ఎంత విచారించీ లాభం ఉండదు," అని హెచ్చరించాడు.

ఆ సాయంత్రం సుబ్బారాయుడు ఇంటికి వచ్చి, అడావుడిగా నాలుగు మెతుకులు కొరికి, మళ్ళీ వెళ్ళిపోబోతూంటే, "ఎక్కడికిరా?" అని తండ్రి అడిగాడు.

"చదువుకోడానికి, నాన్నా!" అన్నాడు సుబ్బారాయుడు, తేలిగ్గా అబద్ధం ఆడుతూ.

వెంటనే తండ్రి వాణ్ణి చింతబరికెతో చావగొట్టి, "మళ్ళీ నాటకాల చాయలకు వెళ్ళావంటే తాట ఒలిచేస్తాను. నాటకాలు నీకు కూడు పెడతాయా, గుడ్డ, పెడతాయా?" అని వాణ్ణి పెరటి వైపు కొట్టంలోకి తోసి, బయట తాళం పెట్టి, "పది రోజులపాటు అందులోనే పడి ఉండు," అన్నాడు.

రాయుడు ఏడుస్తూ కొట్టంలో కూర్చున్నాడు. వాడికి చదువు ఎంత మాత్రమూ ఇష్టం లేదు, నాటకాలే వాడికి సరదాగా ఉంటాయి. నాటకాలలో తిరుగుతూంటే చిరుతిళ్ళకు తరుగు ఉండదు.

ఆ రాత్రి వాడు ఆ కొట్టంలోనే నిద్రపోయాడు. ఒక రాత్రి వేళ వాడికి నిద్రా

ఎం. కామేశ్వరరావు

''పోట్లాడి అయినా నేను చేసుకుని తీరుతాను,'' అన్నాడు విఠల్ ఆవేశంగా.

''తొందరపడకు. ఉపాయం ఆలోచింతాం,'' అన్నాడు సోమయ్య.

ఒకనాడు సోమయ్య తన ఇంటికి మామిడి తోరణాలు కట్టుతూంటే, పొలం నుంచి వస్తున్న కామయ్య, ''ఏమిటి విశేషం?'' అని అడిగాడు.

''మొన్న విశాలపురం తీర్థానికి వెళ్లినప్పుడు, జమీందారుగారి తమ్ముడు గంగని చూసి, పెళ్ళి చేసుకుంటానన్నాడు. ఇవాళ వాళ్లు పెళ్లి చూపులకు వస్తున్నారు,'' అన్నాడు సోమయ్య.

మధ్యాన్నం గుర్రాల మీదా, మేనాల మీదా పెళ్లి వారు వచ్చారు. రకరకాల కానుకలు తెచ్చారు. బ్రాహ్మణులకు ఘనంగా దక్షిణలిచ్చారు. పెళ్ళిచూపులు అయాక, పెళ్ళి కబురు చేస్తామని వెళ్ళిపోయారు.

కామయ్య గుండెల్లో రాయి పడింది. ఈ సంబంధం జరిగితే సోమయ్య తన కన్న ఎదిగిపోయి, తనను పురుగును చూసినట్టు చూస్తాడు. జమీందార్లకు పనికివచ్చిన గంగ తమ ఇంటికి ఎందుకు పనికి రాదు ?

కామయ్య చాలాసేపు మథనపడి, చివరకు సోమయ్య దగ్గిరికివచ్చి, ''మనం ఆ బాల్యస్నేహితులం. మా అబ్బాయికి మీ అమ్మాయిని చేసుకుంటే వియ్యం కూడా ఏర్పడి మన మధ్య బంధం దృఢమవుతుంది,'' అన్నాడు.

''నేను మీతో తూగగలనా?'' అన్నాడు సోమయ్య.

కామయ్య ముఖ్య ఆశయం ఆ జమీందారు సంబంధాన్ని చెడగొట్టడమే. ఖర్చులన్నీ తనే పెట్టుకుని పెళ్ళి జరిపిస్తానని, అతను సోమయ్యను ఒప్పించాడు.

విఠల్ తన తండ్రికి తెలియకుండా వెయ్యి రూపాయలు ఖర్చుచేసి ఆడించిన మాయజమీందారు నాటకంతో అవివేకి కామయ్య పూర్తిగా మోసపోయాడు. విఠల్‌కూ, గంగకూ పెళ్లి జరిగిపోయింది.



భంగమయింది. లేచి చూస్తే వాడికి మూడు ఆకారాలు కనబడ్డాయి. వాటిని చూడగానే రాయుడు భయంతో కొయ్యబారిపోయాడు.

"భయపడకు. మేం నీకేమీ అపకారం చెయ్యం. మేం వచ్చే అమావాస్య రోజున మా నాయకుడి ముందు ఒక నాటకం ప్రదర్శించబోతున్నాం. అభ్యాసం చెయ్యటానికి వారం రోజులున్నాయి. ఆ నాటకంలో ఒక మనిషి పాత్ర ఉన్నది. దాన్ని నువు ధరించాలి. ఏమంటావు?" అన్నాయి పిశాచాలు.

అవి రాయుడి చేత సరే అనిపించి, కొట్టం తలుపుమూసి ఉండగానే, వాణ్ణి పట్టుకుని తీసుకుపోయాయి. తండ్రి చంపుతాడని రాయుడు భయపడితే, రాత్రులు మాత్రమే అభ్యాసం జరుగుతుందనీ, తెల్లవారేలోపల రాయుణ్ణి కొట్టంలో చేర్చి, రహస్యం కాపాడతామనీ పిశాచాలు చెప్పాయి.

పిశాచాలు ఆడదలచిన నాటకంలో మూడు పిశాచాలు నానా కష్టాలూపడి సంచీడు బంగారం సంపాదిస్తాయి. దాన్ని పంచుకోవటంలో వాటికి తగాదావస్తుంది. అవి ఒక మనిషిని నమ్మి, తమకు బంగారాన్ని న్యాయంగా పంచమని వాణ్ణి కోరుతాయి. ఆ మనిషి నమ్మకద్రోహం చేసి, బంగారం కాజేస్తాడు. ఆ నమ్మకద్రోహి అయిన మనిషి వేషమే రాయుడు వెయ్యాలి.



నాటకంలో ముందు చాలాసేపు పిశాచాలు బంగారాన్ని ఎలా సంపాదించినదీ ఉంటుంది. అభ్యాసం సమయంలో అవి వాస్తవికత కోసం నిజంగానే సంచీడు బంగారం తీసుకువచ్చి, రాయుడి చేతికిచ్చాయి.

రాయుడు ఆ సంచీని భుజానికి తగిలించుకుని, తన పాత్రను అమోఘంగా నటించాడు. వాణ్ణి పిశాచాలు తెగ మెచ్చుకున్నాయి.

తెల్లవారవస్తూండగా అవి రాయుణ్ణి తిరిగి కొట్టంలో దిగబెట్టాయి. అయితే బంగారంగల సంచీ ఇంకా వాడి భుజానికే ఉన్నది. వాడు తనపంట పండిందనుకుని, ఆ సంచీని కొట్టంలోనే గడ్డి కింద దాచిపెట్టాడు. ఇంట్లోవాళ్ళకి వాడు పిశాచాల సంగతి చెప్పలేదు. చెబితే వాళ్ళు భయపడటమేగాక, తనను అభ్యాసానికి వెళ్లనియ్యరు.

రాయుణ్ణి అతడి తండ్రి రోజూ రాత్రి కాగానే కొట్టంలో పెట్టి తాళం పెట్టేవాడు. రోజూ పిశాచాలు వచ్చి వాణ్ణి అభ్యాసానికి తమ వెంట తీసుకుపోయి, సంచీడు బంగారం వాడికి ఇచ్చేవి. ఇలా ఏడు రోజులూ వాడు ఏడు సంచీల బంగారం తెచ్చుకున్నాడు.

అమావాస్యనాటిరాత్రి పిశాచాలు తమ నాయకుడి సమక్షంలో నాటకం ప్రదర్శించాయి. నాయకుడు నాటకాన్ని మెచ్చుకున్నాడు. పిశాచాలు రాయుణ్ణి ప్రశం



సించి, వాణ్ణి కొట్టంలో దిగబెట్టి, "ఇక నుంచీ మేము రాము," అని చెప్పి వెళ్ళి పోయాయి.

ఇక పిశాచాల బెడద వదిలింది గనక, రాయుడు తన ఏడుసంచుల బంగారమూ తన తల్లిదండ్రులకు చూపించి, జరిగిన దంతా చెప్పి, "చూడండి, నాటకాలు కూడా, గుడ్డా పెట్టవన్నారు. నాటకాల మీద ఎంత సంపాదించానో చూడండి. ఇక మీరు చెప్పినట్టే నాటకాలజోలికి పోను. ఈ బంగారంతో పట్నంలో వ్యాపారం పెట్టితే, దర్జాగా బతకవచ్చు. ఎంత చదువు చదివితే మాత్రం ఇంత బంగారం సంపాదించటం సాధ్యమవుతుందా?" అన్నాడు.

కొడుకు ప్రయోజకత్వం చూసి తల్లి దండ్రులు ఎంతగానో సంతోషించారు. వాళ్ళు ఏడుసంచుల బంగారాన్ని ఒక పెద్దసంచీలో సర్దేసి, మర్నాడు ఇంటిల్లిపాదీ ప్రయాణంకావటానికి ఏర్పాట్లు చేసు కున్నారు.

కాని ఆ రాత్రి పిశాచాలు వచ్చి, గాఢ నిద్రలో వున్న రాయుణ్ణి గట్టిగా తట్టి లేపాయి.

"మళ్ళీ రామన్నారుగా? ఇంకోనాటకం ఆడాలా ఏం?" అని రాయుడు చిరాగ్గా వాటిని అడిగాడు.

"నాటకంలోనే కాదు, జీవితంలో కూడా నువు నమ్మకద్రోహివే. పవిత్రమైన నాటక కళకు ద్రోహం తలపెట్టావు. మేం బతికి ఉండగా పేరుమోసిన నటులం. నువు నిజమైన కళాకారుడివనీ, ప్రోత్సాహం ఇస్తే నాటక కళను ఉద్ధరిస్తావనీ, పెద్ద నాటకసమాజం ఏర్పాటుచేసి, గుర్తింపు లేకుండా ఉన్న మంచి నటులను చేరదీసి, నీ జన్మ అంతా కళాసేవకు వినియోగిస్తా వనీ అనుకుని నీకు బంగారం ఇచ్చాం. ఈ బంగారం తీసుకోవటానికి నువు అర్హుడివి కావు. నిజమైన అర్హుడు కనిపించినప్పుడు వాడికే ఇస్తాం," అని పెద్ద సంచీడు బంగారమూ తీసుకుని పిశాచాలు మాయం అయిపోయాయి.






ఒక కొండ ప్రాంతంలో ఒక గొల్లపల్లి ఉండేది. అక్కడ అందరూ గొల్లలే. వాళ్ళు కొండ దిగువ ఉన్న గ్రామాలలో పాలూ, పెరుగూ, నెయ్యీ అమ్ముకుంటూ, తాము పెంచే గొర్రెల ఉన్నితో కంబళ్ళు నేసి, వాటిని కూడా మారు బేరగాళ్ళకు అమ్ముతూ జీవనం గడిపేవాళ్ళు.

గొల్లపల్లిలో ఒక అమ్మవారి గుడి ఉండేది. ఒకరోజు ఆ గుడిలోకి ఒక గణాచారి వచ్చాడు. గొల్లలు కొండ దిగి పోబోతూ అమ్మవారికి దణ్ణం పెట్టుకోవటానికి గుడికి వచ్చారు. వారిని చూసి గణాచారి, ''దాహం! దాహం! నాకు బలి కావాలి! లేకపోతే అందరినీ మింగేస్తాను,'' అంటూ పూనకం వచ్చినట్టు ఊగిపోయాడు.

అమాయకులైన గొల్లలు తమ కడవలన్నీ దించి, ''శాంతించు, తల్లీ! మా పిల్లపాపలను కాపాడు,'' అని ప్రార్థిస్తూ, ఊగిపోతున్న గణాచారిని వేపమండలతో విసిరారు.

గణాచారికి పూనకం దిగిపోయింది. గొల్లలు అతన్ని కొండమీదనే ఉండమనీ, అతనికి ఇల్లు కట్టిపెడతామనీ అన్నారు. గణాచారి ఒప్పుకుని, తన అవసరాలన్నీ గొల్లలే చూస్తూంటే, అక్కడ సుఖంగా ఉన్నాడు.

ఇలా ఉండగా ఒకరోజు గొల్ల పెద్ద కొడుక్కు అకస్మాత్తుగా మైకం వచ్చింది. గొల్లపెద్ద పరుగు పరుగున గణాచారి వద్దకు వెళ్ళి, తన కొడుకును రక్షించమని ప్రార్థించాడు.

''ఒట్టి ప్రార్థనలు నేను మన్నించనురా. నాకు వేట కావాలిరా! గొర్రెపోతు కావాలి! విన్నావా?'' అంటూ గణాచారి తూలిపోయాడు.

మారుపాక మంజురాణి

గొల్లపెద్ద విధిలేక గణాచారికి గొర్రె పోతునిచ్చాడు.

గొల్లపెద్ద కొడుక్కు గణాచారి విభూతి ఇచ్చాడు. వాడి మైకం కొద్దిసేపటికి తగ్గి పోయింది.

గొల్లలు గణాచారిని దేవీభక్తుడుగానే గాక, వైద్యుడుగా కూడా గౌరవించటం ప్రారంభించారు.

గొల్లపెద్ద మరికొందరు గొల్లలతో సహా నెయ్యిఅమ్ముకోవటానికి సంతకు వెళ్లాడు. తాను గణాచారికి ఇచ్చిన గొర్రెపోతును ఎవరో కొనుక్కుపోతూండటం అతను చూశాడు.

గణాచారి చేసిన మోసం అతనికి తెలిసిపోయింది.

కాని గణాచారి మోసగాడంటే గొల్లలు ఎవరూ నమ్మరు సరికదా, తనను నాస్తికు డంటారు. అందుచేత మోసాన్ని మోసం తోనే జయించాలి.

గొల్లపెద్ద తన గ్రామానికి తిరిగివచ్చి, గుడిని చేరుతూనే తూలుతూ, "గణాచారి అపవిత్రమైన పని చేశాడురా! నేను భరించలేను. గణాచారి మీది నుంచి పోతున్నానురా!" అన్నాడు.

గొల్లలు అతనికి గుగ్గిలం పొగవేసి, వేపమండలతో విసిరారు. చాలాసేపటికి గాని గొల్లపెద్ద శాంతించలేదు.

ఆ రాత్రి గణాచారి మూటా, ముల్లే సర్దుకుంటుంటే, అతని కొడుకు, "ఎందుకు, నాన్నా, వెళ్ళిపోవడం? ఇక్కడ మనకు బాగానే జరుగుతున్నది గదా!" అన్నాడు.

"మన మోసం గొల్ల పెద్ద గ్రహించాడు. అందుకే తనకు కూడా పూనకం వచ్చినట్టు నటించి, నా మీద అలా చెప్పాడు. నేను వాడి పూనకం మాటలను పాటించకపోతే, నా పూనకం మాటలు గొల్లలు ఎలా పాటిస్తారు? అందుచేత మనం ఇక్కడినుంచి పోకతప్పదు." అన్నాడు గణాచారి తన కొడుకుతో.

గణాచారి వెళ్ళిపోయాక గొల్లపెద్దకు మళ్ళీ ఎన్నడూ పూనకం రాలేదు.





# కుతంత్రం

విజయపుర మహారాజు జయదేవుడికి సాధు సన్యాసులంటే చాలా భక్తి. ఒక రోజు ఆయన కొలువులోకి ఒక సన్యాసి వచ్చాడు. రాజు సన్యాసిని ఎంతో ఆదరించి వచ్చిన పని అడిగాడు.

''సన్యాసిని, నాకు స్వయంగా ఏం కోరికలుంటాయి? నేను నీ క్షేమమూ, నీ ప్రజలక్షేమమూ కోరే వచ్చాను. నువు సుఖపడాలంటే, శత్రుభయమూ, శత్రుశేషమూ ఉండరాదు. అందుకొరకు నేను నా మంత్రశక్తితో నీ సేనానిని అజేయుడిగా చేయదలిచాను,'' అన్నాడు సన్యాసి.

''తమ చిత్తం!'' అన్నాడు రాజు.

ఇంతలో మహామంత్రి అడ్డం వచ్చి, ''మహారాజా! ఈ సన్యాసి మాటల్లో అపస్వరం ధ్వనిస్తున్నది,'' అన్నాడు.

జయదేవుడు చప్పున మండిపడి, "అసందర్భంగా మాట్లాడకండి," అన్నాడు.

సన్యాసి తన ఆసనం నుంచి లేచి, చరచరా బయటికి వెళ్ళిపోయాడు.

రాజు మంత్రి మీద మండిపడి, ''ఈ క్షణం నుంచీ నువు మంత్రివి కావు, నిన్ను ఉరి తీయిస్తాను,'' అన్నాడు.

''చచ్చిపోయే ముందు నాకు ఒకటే కోరిక, మహారాజా! ఏలినవారు స్వయాన సన్యాసిని పరీక్షించి నిజం తెలుసుకోండి,'' అన్నాడు మంత్రి.

మంత్రి మనసులో తనకు తెలియని నిజం ఏదో ఉన్నదని రాజుకు తోచింది.

''నీ అనుమానానికి కారణం ఏమిటో చెప్పు,'' అన్నాడాయన.

''మహారాజా, మన సేనానికి ఈ మధ్య దుర్బుద్ధిపుట్టిందని నాకు చూచాయగా తెలియవచ్చింది. నా అనుమానం రుజువు కాగానే తమతో మనవి చేద్దామనుకుంటు న్నాను,'' అన్నాడు మంత్రి.

ఎస్. నంజీవరావు

''ఇంతకూ ఈ సన్యాసి మీద అనుమానానికి కారణం ఏమిటి?'' అని రాజు అడిగాడు.

''తమకు సన్యాసులంటే భక్తి అన్నది లోకమెరిగిన సంగతే. అందుచేత సేనాని తన ప్రయోజనం కోసం ఒక సన్యాసిని నియోగిస్తే ఆశ్చర్యం లేదు. సేనానిని అజేయుడుగా చేసే మంత్రశక్తి సన్యాసికి ఉంటే ఏలినవారినే చేయవచ్చును గదా? మధ్యలో సేనానిని చేయటం దేనికి? సేనాని అజేయుడన్న నమ్మకం సేనకు కుదిరాక అది సేనాని ఏ ఆజ్ఞలను జారీచేసినా అమలు చేస్తుంది కద! ఈ సంగతి నేను తెలుసుకున్నానని గ్రహించి సన్యాసి వెళ్లిపోయాడు. లేకపోతే నాకు పడిన మరణశిక్ష అతనికి పడేది!'' అన్నాడు మంత్రి.

''సన్యాసి నువు చెప్పినట్టు ద్రోహి అయితే అతనికి శక్తులుండవు గదా. సేనానిని అజేయుడుగా ఎలా చేస్తాడు?'' అని రాజు అడిగాడు.

''సన్యాసికి శక్తులుండటం ప్రధానం కానేకాదు. అతను సేనానిని సర్వశక్తి సంపన్నుణ్ణి చేశాడని లోకం నమ్మటం ప్రధానం. అలాటి నమ్మకం ప్రజలకు కలిగాక సేనాని రాజద్రోహం తలపెట్టటం ఎంతసేపు?'' అన్నాడు మంత్రి.

రాజుకు మంత్రి మాటల్లో నమ్మకం కుదిరింది. చీకటి పడగానే ఆయన బికారి వేషంలో సన్యాసి ఉన్న విడిదికి వెళ్ళాడు. కిటికీలో నుంచి తొంగి చూస్తే సన్యాసి దగ్గర సేనాని ఉన్నాడు. వారి సంభాషణ కొంచెం వినేసరికల్లా కుతంత్రం జరుగుతున్నట్టు స్పష్టమయింది.

జయదేవుడు రాజభవనానికి తిరిగి వచ్చి, భటులను పంపి, సన్యాసినీ, సేనానినీ బంధించి తెప్పించాడు. సేనాని రాజద్రోహం గురించి విచారణ జరిగింది. అయినా రాజు సేనానికి శిక్షవిధించక, ప్రజాభిమానాన్ని పొందటానికి అతనితో ద్వంద్వయుద్ధంచేసి, చంపాడు. సన్యాసికి దేశబహిష్కరణ శిక్ష విధించబడింది.





# గుణపాఠం

రామయ్య భార్య సీతమ్మ. రామయ్య తల్లి దుర్గమ్మ కొంత గయ్యాళి స్వభావం కలది. ఆమెకు ఏమీ తోచనప్పుడు కోడల్ని పట్టుకుని దేనికో ఒకదానికి సాధిస్తూండేది.

ఒకరోజు తెల్లవారు ఝామున దుర్గమ్మకు ఒక కల వచ్చింది. ఆ కలలో సీతమ్మ దుర్గమ్మకు ఎదురు తిరిగింది. మాటలతో పోనియ్యక అత్తగారి మీద చెయ్యి కూడా చేసుకున్నది. దుర్గమ్మకు పెద్ద దెబ్బ తగిలింది.

దుర్గమ్మ దిగ్గున లేచి కూర్చున్నది. తెల్లవారు ఝామున వచ్చిన కలలు నిజమవుతాయంటారు! దుర్గమ్మ లేస్తూనే తన కోడలి మీద దండకం మొదలు పెట్టింది, ''రాత్రి కలలో నన్ను కొడతావుటే? ఏం నీ పొగరుబోతనం!'' అంటూ సీతమ్మను మొట్టింది.

సీతమ్మ ఏమీ అనలేదు. రామయ్య ఇదంతా చూస్తూనే ఉన్నాడు. కాని ఏం చేస్తాడు? తల్లి నోరంటే అతనికి భయమే.

రోజు రోజుకూ దుర్గమ్మ ఆగడం మించిపోతున్నది. ఆమెకు తరచుగా కలలు రావటమూ, వాటిని సాకుగా పెట్టుకుని ఆమె కోడలిని హింసపెట్టటమూ రాను రాను మితిమీరింది. రామయ్య ఎన్నోసార్లు తల్లిని ఇంట్లోనుంచి గెంటెయ్యాలనుకున్నాడు. కాని వివేకం అడ్డు వచ్చేది. కన్న కొడుకే ఆమెను బయటికి గెంటేస్తే ఆమెకు దిక్కెవరు? అందుచేత, ఆమెకు తెలివిగా గుణపాఠం చెప్పాలనుకున్నాడు.

రామయ్య ఒక రోజు ఉదయం లేస్తూనే తల్లి దగ్గరకు వచ్చి, నమస్కారం చేసి, ''అమ్మా, నాకు ఒక కల వచ్చింది.

ఎస్. రామకృష్ణ

అందులో, నీకు రోజూ డబ్బు ఇయ్యమని వచ్చింది. తీసుకో,'' అని కొంత డబ్బు చేతిలో పెట్టాడు.

''మా నాయనే!'' అంటూ మురిసి పోయింది దుర్గమ్మ.

ఇదంతా చూస్తున్న సీతమ్మకు మతి పోయింది. ఆమె రహస్యంగా ఆ మాటే అడిగితే, ''ఇదంతా ఒక నాటకం. నువ్వేమీ ఎరగనట్టు ఊరుకో. మా అమ్మకు ఒకసారి గట్టిగా బుద్ధి చెప్పాలి,'' అన్నాడు రామయ్య.

ఇలా కొన్నాళ్ళు జరిగిన తరవాత రామయ్య ఒక ఉదయం పూట తల్లి దగ్గిరికి వచ్చి, ఎంతో విచారంగా ముఖం పెట్టి, ''అమ్మా, న్యాయస్థానానికి పద!'' అన్నాడు.

దుర్గమ్మనిర్ఘాంతపోయి,"ఎందుకురా?" అన్నది.

''నాకు కల వచ్చిందమ్మా! నువు నీ కోడల్ని చంపావుట.. నేను నిన్ను న్యాయస్థానానికి తీసుకుపోయి, రక్షక భటులకు అప్పగించానుట. ఆలశ్యం దేనికి, వెంటనే బయలుదేరు!'' అన్నాడు రామయ్య.

దుర్గమ్మ లబోదిబోమంటూ, ''ఓరి దరిద్రుడా! కల వచ్చిందా? అందులో నేను నీ పెళ్లాన్ని చంపానా? కలలో జరిగినది నిజమవుతుందిరా? కలను నమ్మి నన్ను జైల్లో పెట్టిస్తావురా?'' అన్నది.

''నీ కోడలు నిన్ను కలలో కొట్టిందని ఇన్నాళ్ళుగా సాధిస్తున్నావుగా, అమ్మా? అంతా అబద్ధమేనంటావా? నిన్ను చూసి నేను కూడా కలలను నమ్మటం మొదలు పెడితినే!'' అన్నాడు రామయ్య.

సీతమ్మ అడ్డువచ్చి, ''పెద్ద ఆవిడతో ఎంతసేపండీ ఆ వెటకారాలూ?'' అని భర్తను మందలించింది.

దుర్గమ్మకు చప్పున జ్ఞానోదయమయింది. ఆమె అప్పటికప్పుడే తన బుద్ధితక్కువకు కోడలికి క్షమాపణ చెప్పుకున్నది.






యుద్ధంలో మైరావణుడు మరణించిన వార్త సువర్చలాదేవి ద్వారా చంద్రసేన విన్నది. సువర్చల ఆమెకు లంకా రాజ్యానికి మత్స్యవల్లభుడు పట్టాభిషిక్తుడైనట్టు కూడా చెప్పింది.

మైరావణుడి చెర నుంచి తనకు విముక్తి కలిగిందని ఆనందపడుతున్న చంద్రసేనతో, సువర్చల, "అమ్మా, నువు అదృష్టవంతురాలివి. మైరావణ సంహారం చేసి, రామచంద్రుడు సరాసరి నీ భవనానికే వస్తున్నాడు," అన్నది.

ఈ శుభవార్త చెప్పి సువర్చలాదేవి వెళ్ళిపోగానే, చంద్రసేన సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతూ, రాముడికి తగిన విధంగా స్వాగతం చెప్పేందుకు సన్నాహాలు ప్రారంభించింది. ముందుగా తానున్న మందిరంలో పూలతోరణాలు కట్టింది. చందనతాంబూలాలనూ, అభిషేకజలాన్నీ సిద్ధపరిచింది. హంసతూలికాతల్పం మీద పూలు చల్లింది.

ఈ పనులన్నీ పూర్తికాగానే చంద్రసేన ఒక బంగారుపళ్ళెంలో పూవులూ, పన్నీరు కలశం పెట్టుకుని రాముని రాక కోసం చూస్తూ, ద్వారం వద్ద నిలబడింది. ఒకటి రెండు నిమిషాలు గడిచేలోపలే ముందు హనుమంతుడూ, వెనకగా రాముడూ రావటం ఆమె కంటబడింది. రాముణ్ణి చూస్తూనే, చంద్రసేన సిగ్గుతో తడబాటు చెంది, ఆనందతన్మయత్వంలో చేతులు మోడ్చి, మోకరిల్లి కూర్చున్నది.

**33. రామలక్ష్మణుల ఆగమనం**



హనుమంతుడు ముందుగా గదిలో ప్రవేశించి చంద్రసేనతో, "అమ్మా, నీకు చేసిన వాగ్దానం ప్రకారం రామచంద్రుణ్ణి, నీ మందిరానికి తీసుకువచ్చాను," అన్నాడు.

ఆ మాటలు వింటూనే చంద్రసేన కళ్లు తెరిచింది. ఎదురుగా ఆమెకు రాముడు శాంతగంభీరవదనంతో సాక్షాత్కరించాడు. వెంటనే ఆమె తొట్రుపడుతూ రాముని పాదాలను బంగారుపళ్ళెరంలో కడిగి, ఆ నీటిని తలపై చల్లుకుని, అతడిని పూలతో పూజించి, కర్పూరహారతి యిచ్చింది.

చంద్రసేన ఆనందపారవశ్యంలో మాట్లాడబోయి, పెదవులు తడబడగా మాట్లాడలేకపోయింది. ఆమె మౌనంగా రాముణ్ణి ఆహ్వానించుతూ హంసతూలికా తల్పం దగ్గిరకు తీసుకుపోయింది. అక్కడ శయ్యపైన వున్న ఒక పుష్ప హారాన్ని తీసుకుని రాముడి మెడలో వేసేందుకు కదిలింది.

ఈలోపల రాముడు హంసతూలికా తల్పాన్ని సమీపించి, దానిమీద కూర్చో బోతూండగా, తల్పం ఫెళఫెళమంటూ మధ్యకు విరిగిపోయింది.

చంద్రసేన ఏమిజరిగినదీ తెలియని పారవశ్యంలో, రాముడి మెడలో పూల మాల వేయబోతూండగా అతడామెను వారించి, "చంద్రసేనా! చూశావుగద? శకునం ఏమాత్రం బాగాలేదు." అన్నాడు. ఆ మరుక్షణం చంద్రసేన చేతుల నుంచి పూలమాల జారి, రాముడి పాదాల మీద కుప్పగా పడింది.

అప్పటికి చంద్రసేన తెప్పరిల్లి, విరిగి పోయిన హంసతూలికాతల్పాని కేసి తీవ్రంగా చూసింది. తల్పాన్ని విరిగిపడేలా చేసిన హనుమంతుడు అక్కడే సూక్ష్మ రూపంలో దాగివున్నాడు. అతడు చంద్ర సేన తీక్ష్ణదృష్టిని భరించలేకపోయాడు.

హనుమంతుడు వెంటనే తన సూక్ష్మ రూపాన్ని విసర్జించి, మామూలు రూపంతో చంద్రసేన ముందు మోకరిల్లి, "తల్లీ,

నన్ను క్షమించు! అవసరంకొద్దీ వాగ్దానం చేశాను. ఆ ప్రకారం రాముణ్ణి నీ దగ్గిరకు తీసుకువచ్చాను. కాని, రాముడు ఏకపత్నీ వ్రతుడు. ఫలాపేక్షలేకుండా ఆయన్ని సేవించటమే ఉత్తమపద్ధతి.'' అన్నాడు.

చంద్రసేన ఏదో చెప్పాలని చూసింది కాని, గొంతు తడబడింది. రాముడు తేజో వంతమైన శాంతనయనాలతో చూస్తూ ఆమెకు పరతత్వజ్ఞానాన్ని బోధించాడు. ఆ సమయంలో చంద్రసేనకు, రాముడు మహావిష్ణువులా కనిపించాడు. ఆ విష్ణువు, చంద్రసేనతో, ''చంద్రసేనా! ఇప్పుడు రాముడుగా నేను ఏకపత్నీవ్రతుణ్ణి. రాబోయే కృష్ణావతారంలో, నా అష్ట భార్యల్లో నీవు సత్యభామవై, నా కెంతో ప్రియతమురాలి వవుతావు.'' అన్నాడు.

ఆ సమయంలో చంద్రసేనకు, తనలో విష్ణువు నిండివున్నట్టుగానూ, తాను ఒక జ్యోతిలాగా విష్ణుతేజంలో కలిసిపోతున్నట్టు గానూ అనిపించింది. ఆమె జ్యోతిలా ప్రకాశిస్తూ, రాముడిలో లీనంకావటం చూస్తున్న హనుమంతుడు, అద్భుతపడి పోతూ కళ్ళు మూసుకుని, చేతులు జోడించాడు. కొద్దిక్షణాల తరవాత అతడు కళ్ళు తెరిచి చూస్తే, ఎదురుగా రాముడు చిరునవ్వు నవ్వుతూ కనిపించాడు. వెంటనే హనుమంతుడికి అంతకుముందు జరిగిన



దంతా గుర్తులేకుండాపోయి; రావణ సంహారం సంగతి మాత్రమే మనసులో మెదిలింది.

అంతలో అక్కడికి పాతాళ లంకా రాజ్యానికి రాజయిన మత్స్యవల్లభుడు వచ్చాడు. అతడు రాముణ్ణీ, హనుమంతుణ్ణీ పూలతో అర్చించి, వారి నుంచి ఆశీర్వాదాలు పొందాడు. తరవాత అతడు పాతాళలంకావాసులతో కలిసి రాముడికి ఘనంగా వీడ్కోలు యిచ్చాడు. హనుమంతుడు రామలక్ష్మణులను భుజాలపై ఎక్కించుకుని, పాతాళలంకను దాటి, రావణలంక కేసి రివ్వుమంటూ ఆకాశంలోకి ఎగిరాడు మత్స్యవల్లభుడు చేతు



లెత్తి ఊపుతూ, అతడికి జయజయ ధ్వానాలు పలికాడు.

హనుమంతుడు లంకానగరాన్ని చేర నున్న సమయంలో, అక్కడ వున్న వానర సేనతోపాటు, వానరప్రముఖు లందరూ తీరని విచారంలో వున్నారు. వారిలో కొందరు ఆకాశం కేసి ఆశగా చూస్తున్నారు. జాంబవంతుడు మాత్రం మందహాసం చేస్తూ, వానరులకు ధైర్యం చెబుతున్నాడు.

అక్కడ లంకానగరంలో రాక్షసులు బాకాలు ఊదుతూ, ఆనందంకొద్దీ దిక్కులు పిక్కటిల్లేలా కేకలు పెడుతున్నారు. వారిలో కొందరు మద్యం తాగుతూ, పాటలు పాడుతూ నాట్యం చేస్తున్నారు.

రావణుడు అమితోత్సాహంలో వున్నాడు. కాళికి బలిగా పెట్టిన రామలక్ష్మణుల తలలతో మైరావణుడు ఏ క్షణాన అయినా తన దగ్గిరకు రావచ్చుని అతడు ఎదురు చూస్తున్నాడు. రామలక్ష్మణుల తలలను బంగారుపళ్ళెంలో వుంచి, దానిని సీత దగ్గిరకు తీసుకుపోయేందుకు అవసరం అయిన ఏర్పాట్లు కూడా పూర్తిచేశాడు.

కాలం గడుస్తున్నది. రావణుడు తన మందిరం నుంచి బయిటికి వచ్చి, కోట గోడ అంచున నిలబడి, దూరంగా కనిపిస్తున్న వానరసేనను పరికించి, తృప్తిగా నవ్వుకున్నాడు. తలలు వంచుకుని విచారంగా నిలబడివున్న వానరసేనకు ఒకపక్కగా విభీషణుడు నిలబడివున్నాడు. రావణుడు అతణ్ణి గుర్తించి, "ఔరా, తమ్ముడూ విభీషణా, నువ్వెంత అమాయకుడివి! ఇంకా అక్కడ పడిగాపులు గాయటం ఎందుకు? పాతాళకాళీ ప్రసాదంగా రామలక్ష్మణుల తలలు నా దగ్గిరకు రానున్నవి. తలమాంసం అత్యంత రుచికరమైనదని నీకు తెలియంది కాదుగదా. ఆ తలలమాంసం రుచిచూసేందుకైనా, త్వరగా లంకానగరం చేరుకో. నీకేం భయం లేదు. ఎంతైనా నువు, నా తమ్ముడివి. అభయంయిస్తున్నాను. ఇకనుంచి అయినా యువరాజుగా నాపట్ల వినయవిధేయతలతో

మెసులుకో. వెంటనే నగరానికి బయలు దేరు,'' అంటూ, నాలుగు యోజనాల దూరం వినిపించేంత బిగ్గరగా అరిచాడు.

రావణుడి మాటలు వింటూనే విభీష ణుడు చెవులు మూసుకున్నాడు అతడి కళ్ళలో నీళ్ళు తిరిగాయి; దుఃఖంపెల్లుబి కింది. విభీషణుడి దైన్యం చూసి సుగ్రీవు డికి కూడా గుండెజారిపోయింది. వాళ్ళిద్దరి దుఃఖం చూసి మిగతా వానరులు హాహాకారాలుచేస్తూ, ఒకర్ని చూసి ఒకరు ఏడ్వటం మొదలుపెట్టారు.

వానరసేన దీనస్థితి చూసి రావణుడు మరొకసారి తృప్తిగా నవ్వుకున్నాడు. కోట గోడ పక్కగా పోతున్న రాకసస్త్రీలను కేక వేసి పిలిచి, ''మీరిప్పుడే సీత దగ్గిరకు వెళ్ళి, యీ సంగతి చెప్పండి. రాముడి తలతోపాటు లక్ష్మణుడి తలను కూడా ఆమెకు కానుకగా పంపబోతున్నాను. వాళ్ల శరీరాలను పాతాళలంకలోని రాకసులు విందుభోజనంగా తినేసివుంటారు. సీతకు యీ వార్త చెప్పి, రామలక్ష్మణుల తలలు స్వీకరించేందుకు సిద్ధంగావుండమనండి." అన్నాడు ఉత్సాహంగా.

రాకసస్త్రీలకు ఆ క్షణంలో రావణుడి ఆనందం వెనక కొద్దిపాటి మతిచాంచల్యం వున్నట్టు కనిపించింది. వాళ్ళు ఒక క్షణ కాలం తటపటాయించి, రావణుడికి వంగి



నమస్కారాలు చేసి గబగబా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

రావణుడు కోటగోడ మీదినుంచి కదిలి, తిరిగి తన మందిరానికి పోయి, గవాక్షం దగ్గిర కూర్చుని, మైరావణుడి రాక కోసం సముద్రం మీద ఆకాశపు అంచు కేసి ఆశగా చూడసాగాడు. అంతలో అతడికి, ఆకాశంలో నలుసు లాంటి ఆకారం ఒకటి ఎగిరి వస్తూండటం కంటబడింది.

రావణుడు దిగ్గున గవాక్షంముందు లేచి నిలబడి, చప్పట్లు చరుస్తూ, ''అదుగో, మైరావణుడు కాళికి బలిచేసిన రామ లక్ష్మణుల తలలు తెస్తున్నాడు. బంగారు పళ్ళెం ఎక్కడ? తలలను అందులో



పెట్టాలి. త్వరగా పళ్ళెం తెండి!'' అని, అంతలోనే బిక్కచచ్చి, హతాశుడై కూలబడ్డాడు.

సముద్రం మీది ఆకాశం కేసి చూస్తూ నిలబడివున్న జాంబవంతుడు, ఆకాశంలో నలుసు లాంటి రూపం కనిపించగానే ఆ రూపం ఎవరిదో గుర్తించి, పక్కకు తల తిప్పాడు. పక్కనే నిలబడి సముద్రం కేసి చూస్తున్న అంగదుడు ఆశ్చర్యంగా జాంబవంతుడి కేసి చూశాడు.

జాంబవంతుడు చేతులెత్తి, వానరులతో, ''అదుగో, చూడండి. హనుమంతుడు వస్తున్నాడు. ఇక విచారం మానండి,'' అన్నాడు.

అంగదుడు ఉత్సాహం పట్టలేక, విజయ ధ్వానం చేసి, ''మన హనుమంతుడు రామలక్ష్మణులతో వస్తున్నాడు. స్వాగతం చెప్పండి,'' అంటూ కేక పెట్టాడు.

రామలక్ష్మణులను భుజాలపై ఎక్కించుకుని వస్తున్న హనుమంతుణ్ణి చూసి, వానర సైన్యం ఆనందంతో ఎగిరి గంతులు వేసింది. జయజయధ్వానాలు మిన్ను ముట్టాయి. అక్కడ లంకానగరంలో రాక్షసుల ఆనందోత్సవాలు హఠాత్తుగా ఆగిపోయాయి.

వానరసేన ఉత్సాహంతో వేసే కేకలూ, అక్కడ రేగిన కోలాహలం వింటూ రావణుడు తన మందిరంలోని గవాక్షం దగ్గిర స్థాణువులా నిలబడిపోయాడు. అతడికి రామలక్ష్మణులు సజీవులని మాత్రం అర్థమైంది. కాని, మైరావణుడూ, అతడి అన్నా ఏమైనట్టు? వాళ్ళను హనుమంతుడు గాని, రామలక్ష్మణులు గాని సంహరించారా?

రావణుడు యిలా ఆలోచిస్తున్నంతలో రాక్షస సైనికుడొకడు అతడి దగ్గిరకు వచ్చి, తాను వానర సైనికుల మాటల ద్వారా విన్నదంతా చెప్పాడు. ఆ విధంగా రావణుడికి పాతాళలంకలో జరిగినదంతా తెలిసింది. వెంటనే అతడు భయకంపితుడైపోయి, చిన్నగా కేక పెట్టి మూర్ఛపోయాడు.

కొంతసేపటికి రావణుడు మూర్ఛ నుంచి తెప్పరిల్లాడు. ఇప్పుడతడిలో కోపం, ద్వేషం పరవళ్ళు తీయసాగాయి. అతడు పిడికెళ్ళు బిగించి, పళ్ళు కొరుకుతూ, "నా ప్రేమాస్పదుడైన ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణుడెక్కడ? వాణ్ణి ఎక్కడ దాగి వున్నా చంపి తీరుతాను. వాడెక్కడో వానరసేన మధ్యంలో పిరికి పందలా దాగి వుంటాడు. వాణ్ణి నా కంట పడమనండి. వాడి ఆయువు యివాళ్టితో ముగిసినట్టే!" అంటూ ఉన్మాదిలా అరవసాగాడు.

రావణుడి యీ దుస్థితి చూసి మండోదరి విస్తుపోయి, కంట నీరు పెట్టుకున్నది. రావణుడు ఆమెను చూసీ చూడనట్టే, కాళ్ళతో భూమిని తన్నుతూ, "ఆ లక్ష్మణుణ్ణి చంపటానికి నాకు ఎవరి సహాయమూ అక్కరలేదు. నేనొక్కణ్ణే యుద్ధంలో ఆ రామలక్ష్మణులను చంపి, వాళ్ళ తలలను సీతకు పంపుతాను. మధ్యలో యీ మైరావణుడు వచ్చి నాకు లేనిపోని ఆశలు కల్పించి, నా అమూల్యమైన కాలమంతా వృధా చేశాడు. వాడూ, వాడి అన్నా అసమర్థులూ, పిరికిపందలూ కనకే, వాళ్ళను రాముడు సునాయాసంగా చంపగలిగాడు. సరే, ఆ మైరావణ భ్రష్టుడి సంగతి వదిలేస్తాను. నా సుపుత్రుడు ఇంద్రజిత్తును చంపిన, ఆ లక్ష్మణుణ్ణి ముందుగా నా ఆయుధానికి బలిపెట్టాలి," అంటూ పిచ్చిగా కేకలు పెట్టాడు.

వానరసేన యుద్ధానికి సర్వసన్నద్ధమై శంఖాలు పూరిస్తూ చేస్తున్న కోలాహలం రావణుడికి వినిపించింది. అది వింటూనే అతడి కళ్ళు నిప్పుల్లా మెరిశాయి. రౌద్రంతో శరీరమంతా జ్వాలలాగా ఎరుపెక్కింది. అతని కళ్ళలోని అశ్రుజలం యింకిపోయి, పౌరుషం కరుడుకట్టింది.

రావణుడు వెంటనే కవచం ధరించి, విల్లంబులు తీసుకుని, "ఆ లక్ష్మణుడెక్కడ?" అంటూ తన మందిరం నుంచి బయిటికి వచ్చి, వానరసేన కేసి బయలుదేరాడు.



# వైశాలీనగర పతనం



ఇది గౌతమబుద్ధుని కాలంనాటి చారిత్రిక సంఘటన. గంగానదీ తీరంలోని వైశాలీరాజ్యం సర్వ సంపదలతో తులతూగుతూండేది. రాజ్యపాలన గణతంత్ర పద్ధతిలో జరిగేది. వయోజనులందరూ కలిసి చట్టసభకు కొందరు ప్రతినిధులను ఎన్నుకునేవారు. ఆ ప్రతినిధులు తమలో నుంచి రాజ్యపాలన నిర్వహించేందుకు యిద్దరు పెద్దలను ఎన్నుకునేవారు.



గంగానదికి ఆవలగల మగధరాజ్యాన్ని అజాతశత్రువు అనే రాజు పాలిస్తూండేవాడు. అతడు వైశాలిని ఆక్రమించేందుకు చాలాసార్లు ప్రయత్నించి విఫలుడయాడు. వైశాలీ ప్రజలు అతడి దండయాత్రలను ఐక్యంగా ప్రతిఘటించి, విజయం సాధిస్తూండేవాళ్ళు.



అజాతశత్రువుకు మంత్రి అయిన వర్షకరుడు చాలా కుటిలుడు, రాజ్యతంత్రంలో అందెవేసిన చేయి. అతడు తన రాజుకు ఒక పథకం వివరించాడు. దాని ప్రకారం రాజు బహిరంగంగా వర్షకరుడిని అవమానించి, మగధ రాజ్యం నుంచి బహిష్కరించాడు.



వశ్యకరుడు అవమానభారంతో కుమిలిపోతున్నట్టు నటిస్తూ, గంగానదిలో పడవ ఎక్కి, వైశాలీనగరం కేసి బయలుదేరాడు. తమ రాజ్యాన్ని ఆక్రమించేందుకు మంత్రి వశ్యకరుడు అభ్యంతరం చెప్పటంవల్లనే, రాజు అజాతశత్రువు అతణ్ణి దేశబహిష్కృతుణ్ణి చేశాడని వైశాలీప్రజలు భావించారు.



వశ్యకరుడి కుటిలతంత్రం తెలియని వైశాలీ ప్రజలు, అతడు తమ నగరం రేవులో దిగగానే, గొప్పగా సన్మానించి, అతణ్ణి ఏనుగు అంబారీ మీద ప్రజాసభకు తీసుకుపోయారు.



తమ దేశ భద్రతకోసమూ, ప్రజల స్వేచ్ఛకోసమూ వశ్యకరుడు చేసిన త్యాగానికి కృతజ్ఞతగా ప్రజా ప్రతినిధులు ఏకగ్రీవంగా అతణ్ణి తమ ప్రభుత్వ సలహాదారుగా ఎన్నుకున్నారు. ఈ విధంగా వశ్యకరుడికి వైశాలీరాజ్య పరిపాలనలో ప్రముఖపాత్ర వహించే అవకాశం చిక్కింది.



వశ్యకరుడు మగధ నుంచి తన వెంట చాలా ధనం తెచ్చాడు. దానితో అతడు వైశాలీనగరంలోని పలుకుబడిగల వ్యక్తులకు విందులూ, వినోదాలూ ఏర్పాటు చేస్తూ, కొద్ది కాలంలోనే ఆ గణతంత్ర రాజ్యంలో చాలా కీర్తి, ప్రతిష్ఠలు సంపాయించాడు.



వైశాలీ రాజ్యపాలన నిర్వహించే యిద్దరు పెద్దల్లో ఒకరికి సైన్యం మీదా, మరొకరికి ప్రజల్లోనూ ఎక్కువ పలుకుబడి వుండటం వశ్యకరుడు గమనించాడు. తన పథకం ప్రకారం వశ్యకరు డిప్పుడు వారిద్దరిమధ్యా అనుమాన, విద్వేషాలు రేకెత్తించేందుకు ప్రయత్నాలు ప్రారంభించాడు.



వశ్యకరుడు తమ అప్తమిత్రుడనే అపోహ యిద్దరు పెద్దలకూ వున్నది. ఆ కారణంవల్ల వశ్యకరుడి కుటిలనీతి వాళ్ళపై పని చేయటం ప్రారంభించి, త్వరలోనే సైన్యం మధ్యా, ప్రజల మధ్యా అనైక్యతకు దారితీసింది.



వశ్యకరుడు దీన్ని అవకాశంగా తీసుకుని, యీసారి సైన్యంలోనే అంతఃకలహాలు పుట్టించాడు. సైన్యం రెండుగా చీలి పోయింది. ప్రజల్లో ప్రత్యర్థిపక్షాలు ఏర్పడినై. వాళ్ళ కలహాలతో వైశాలీ నగరంలో అరాజకస్థితి ఏర్పడింది.



మగధరాజు అజాతశత్రువు, వైశాలిని ఆక్రమించుకోవటానికి యిదే మంచి అదనని గ్రహించిన వశ్యకరుడు, ఆయనకు వర్తమానం పంపాడు. మగధ సైన్యాలు హఠాత్తుగా వచ్చి వైశాలీ నగరం మీద పడ్డాయి.



కోట బురుజుల మీద వున్న సైనికులు, శత్రుదాడి గురించి హెచ్చరిస్తూ బాకాలు ఊదారు, గంటలు మోగించారు. కాని అంతఃకలహాల్లో మునిగివున్న సైన్యంగాని, ప్రజలుగాని శత్రువును ఎదిరించేందుకు ప్రయత్నించలేదు. అజాతశత్రువు, వైశాలీనగరాన్ని సునాయాసంగా జయించి, నగర ప్రజలను బానిసలుగా మగధకు తీసుకుపోయాడు. ఈ విధంగా ప్రాచీన భారతదేశంలోని గణతంత్రరాజ్యం ఒకటి పతనమైపోయింది.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

ఒక నది సమీపంలో ఒక చిన్న మడుగు ఉండేది. అందులో చిన్న చిన్న చేపలు సుఖంగా జీవిస్తూ ఉండేవి. వాటి మధ్య ఒకే ఒక పెద్ద చేప పెరిగింది. దానికి చిన్న చేపలంటే అమిత అలుసుగా ఉండి, వాటి మీద మహా పెత్తనం చెలాయించేది.

"నదిలో నీ హోదాకు తగిన గొప్ప చేపలు ఉన్నాయి. అక్కడికి పోరాదా?" అని చిన్న చేపలు అడిగాయి.

ఈ సారి నదికి వరదలు వచ్చినప్పుడు పెద్ద చేప వరద నీటిలో ఈదుకుంటూ నదిలోకి వెళ్ళింది. అక్కడ అది విశ్రాంతి తీసుకుంటూండగా రెండు మరీ పెద్ద చేపలు అటుగా వచ్చి, "ఎవరు నువ్వు? మా దారికి అడ్డం తొలుగు," అన్నాయి. చేప భయపడి ఒక రాయి కింద చీకటి పడిన దాకా దాక్కుని, డొక్క మాడేసరికి, ఆహారం కోసం బయలుదేరింది. అంతలో ఒక కొరల చేప దాని తోక పట్టుకుని, దాన్ని తినబోయింది. ఆ సమయానికి వాటి మీదుగా ఒక పడవ వెళ్ళింది. ఆ కల్లోలంలో మన చేప చావు తప్పించుకుని, బతుకుజీవుడా అనుకుంటూ, వరద నీరు తియ్యకముందే తిరిగి మడుగుకు వెళ్ళిపోయింది. తరవాత అది చిన్న చేపల మీద ధాష్టీకం చెయ్యలేదు.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలించబడవు.

కార్డులు మాకు జూన్ 20 లోగా చేరాలి. అందులో ఫొటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, '77 ఆగస్టు చందమామలో ప్రకటించబడతవి.

---

ఏప్రిల్ నెల పోటీ ఫలితం: మూర్ఖుడి తీర్పుకి ముద్దాయి సమాధానం.

గెలుపొందిన వారి పేరు: అన్నె శివశంకరరావు, పెదవడ్లపూడి. (గుంటూరు జిల్లా.)

## ఫోటో వ్యాఖ్యల పోటీ : . బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1977 ఆగష్టు నెల సంచికలో ప్రకటింపబడును.



R. Jayapalan





M. Natarajan

★ పై ఫోటోలకు సరిజన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వీరు ధైన వాడు

రెండవ ఫోటో : వీధిని పడక పోడు

పంపినవారు : ఎస్. వారిజ, గుంటూరువారి వీధి, విజయనగరం

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

‘తీసుకోండి,
రుచి అంటె ఏమిటో
తెలుస్తుంది.’

‘తీసుకోండి,
అసలైన రుచి మీకే
తెలుస్తుంది.’







గోల్డ్ స్పాట్–దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.

కొత్తది!

# అముల్ మాల్ట్-కోకో పానీయం

# న్యూట్రాముల్

## ప్రతి కప్పు మీకు పోషణను ఇచ్చు

అముల్ బలాన్నిచ్చే న్యూట్రాముల్ – ఇంతకుమును ఎన్నడూ అందించబడని ఆరోగ్యాన్నిచ్చే పానీయం సమర్పిస్తోంది. సమృద్ధిగా పాలు, శుద్ధమైన మాల్ట్, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజములుగలది, ప్రతి కప్పు ఆరోగ్యాన్ని, శక్తిని పెంపొందిస్తుంది.

మరిక దీని రుచి! అమ్మమ్మ! ఎంతో ఎక్కువ కోకో మరెంతో ఎక్కువ పాలు

సమృద్ధియైన నురుగు గల కోకో గలది. న్యూట్రాముల్ అముల్ వారి కొత్త పాలు మరియు ఆహారాల ప్రోసెసింగ్ కేంద్రంలో—ప్రపంచంలో మేలైన వాటిలో ఇది ఒకటి—రూపొందించబడుతోంది

ప్రతి న్యూట్రాముల్ డబ్బాలో 500 గ్రాముల సరకు ఉంటుంది. అంటే ఇతర వాటికన్న 50 గ్రాములు (5 కప్పులు) అదనం అన్న మాటేగా.

న్యూట్రాముల్ నేడే వాడి చూడండి.




ప్రతి డబ్బాతో 50 గ్రాముల ఎక్కువ సరుకు





మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్, గుజరాత్

daCunha/Nutra/1 P Tel